# 'స్వరాజ్య' వీర
# హరి సర్వోత్తమరావు

హరి ఆదిశేషువు

గాంధీ సాహిత్య ప్రచురణాలయం
[ఆంధ్రప్రదేశ్ గాంధీ స్మారక నిధి]
గాంధీ జ్ఞాన మందిర్, సుల్తాన్ బజార్,
హైదరాబాద్-500 001.

ద్వితీయ ముద్రణ

1000 ప్రతులు

జూన్, 1987

వెల : 5 రూపాయలు

'స్వరాజ్య వీర'

హరి సర్వోత్తమరావు

151 వ ప్రచురణ

ముద్రణ :

నాగార్జున ప్రింటింగ్ వర్క్స్

హైదరాబాద్-500 020.

# ప్రకాశకుల నివేదన

గాంధీ సాహిత్య ప్రచురణాలయం నూతన అక్షరాస్యుల ఉపయోగం నిమిత్తం పుస్తక ప్రచురణను సంకల్పించి నిర్వహించటం ఆంధ్ర పాఠక లోకానికి సుపరిచితం. ఈ పుస్తక పరంపరలో శ్రీ హరి సర్వోత్తముని జీవితం 31 వది. ప్రచురణాలయ ప్రచురణలలో ఇది 151 వ ప్రచురణ.

శ్రీ హరి సర్వోత్తమరావుగారు అర్ధశతాబ్దానికి పైగా తదేక దీక్షతో దేశాభ్యుదయానికి అవిరళ కృషి చేసిన మహనీయుడు. వీరి కృషి ఏదో ఒక రంగానికిగానీ, కొన్ని రంగాలకుగానీ పరిమితమైనది కాదు. దేశం కొరకై ఉన్నత విద్య ఇచ్చే అధికారావకాశాలను వదిలివేసి ఏట్టి ఉద్యోగాన్ని గానీ పదవిని కానీ ఆశించకుండా జన సామాన్యంలో చైతన్యాన్ని కలిగించడానికి సర్వతోముఖ కృషి చేశారు. నిరాడంబర జీవితం గడపటమే కాక స్వచ్ఛందంగా లేమిని వరించారు. ఆయన ఉత్తమ పత్రికా సంపాదకులు; బహు భాషావేత్త. సంస్కృతాంధ్ర ఆంగ్ల భాషల్లో నిష్ణాతులైన పండితులు. అనేక గ్రంథాల రచయిత. భారతీయ సామాజిక జీవితంలో అట్టడుగున ఉన్న మనుషుల అభ్యున్నతికై అనేక విధాల కృషి సలిపారు.

ఆయన చేసిన అన్ని కార్యాలూ ఒక ఎత్తు. వయోజన విద్య, గ్రంథాలయాలు- నిమిత్తము చేసిన కృషి, మరొకఎత్తు. వయోజన విద్యా అధ్యాపకులుగా పుస్తక రచయితగా, శిబిర దర్శకులుగా మద్రాసు వయోజన విద్యాశాఖ గౌరవ డైరెక్టరుగా, దక్షిణ భారత వయోజనవిద్యా

సంఘ అధ్యక్షులుగా ఆయన చేసిన కృషి అనన్య సామాన్యమైనది. ఇక ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘ అధ్యక్షులుగా రెండు దశాబ్దాలకు పైగా వారు చేసిన కృషి నిరుపమానమైనది. వయోజన విద్యపై తన జీవితపు చివరి రెండు దశాబ్దాలు ఎడతెగని కృషి చేసిన శ్రీ హరి సర్వోత్తమరావుగారి జీవిత చరిత్రను నూతన అక్షరాస్యుల కొరకు వారి శతజయంతి సందర్భంలో ప్రచురించ గలగడం మా భాగ్యంగా తలుస్తున్నాము. ఆంధ్ర పాఠక లోకం, ముఖ్యంగా వయోజన విద్య, గ్రంథాలయ ఉద్యమాలలోని కార్యకర్తలు, మా ఈ కృషిని ఆదరిస్తారని ఆశిస్తున్నాము.

ఈ పుస్తక రచయిత శ్రీ ఆదిశేషుగారికి, దీన్ని అంకితంగా స్వీకరించడానికి అంగీకరించిన క్రాస్ సంస్థ డైరెక్టర్ శ్రీ యం. కురియన్‌గారికి అభినందనలు. ద్వితీయ ముద్రణ ముద్రాపకులు శ్రీ నిమ్మగడ్డ వెంకట నారాయణ గారికి, బహుముఖ సహకారానికి, మా ధన్యవాదములు. ఈ కూర్పు ఆవశ్యకతను గుర్తించి, మాకు పూర్తి సహకారం ఇచ్చిన **R.D.A.S.** వారికి శ్రీ జి. బి. థామస్ (**Executive Director**) గారికి మా హార్దిక కృతజ్ఞతలు.

ఇట్లు
**కోదాటి నారాయణరావు**

గాంధి సాహిత్య ప్రచురణాలయం
హైదరాబాదు-1

కార్యదర్శి
సంపాదక సమితి

# ఒక మాట

తెలుగువారిలో చదువురానివారు ఉండకూడదు.
అందుకోరకు మనం కృషి చేయాలి.
ఈనాడు మన దేశంలో చదువురానివారు
ఎందరో ఉన్నారు.
వారిలో చాలామంది వయసులో పెద్దవారు.
ఏవో పని పాటలు చేసుకొనేవారు.
కొందరు పిల్లలు కూడా కలవారు.
వారు రోజూ బడికి పోలేరు.
అయినా, వారు కూడా చదువుకోవచ్చు.
వారు రోజుకు అరగంట కృషి చేస్తేచాలు.
ఏభై రోజులలో వారికి అక్షరాలు అన్నీ వస్తాయి.
వారు మాటలూ, వాక్యాలూ చదువగలరు.
"ఈ పనికి ఏభై రోజులు చాలునా?"
అని మీరు అనుకోవద్దు.
వారికి అ, ఆ, ఇ, ఈ .. అనే వరుసలో
అక్షరాలు—నేర్పరు,
మరో వరుసలో నేర్పుతారు.
అప్పుడే వారికి ఏభై రోజుల్లో చదువు వస్తుంది.
వారికి చెప్పేఅక్షరాల వరుస, పాఠాలు- మీకు కావాలా?
వెంటనే ఒక ఉత్తరం వ్రాయండి.

ఇదిగో చిరునామా :
"గాంధీ సాహిత్య ప్రచురణాలయము.
సుల్తాన్‌బజార్,
హైదరాబాద్-1, ఆంధ్రప్రదేశ్"
మీకు వివరాలు పూర్తిగా తెలుస్తాయి.
అక్షరాలు రాగానే చదువు పూర్తి కాదు.
అప్పుడే, అసలు చదువుకి మొదలు.
అటువంటి వారికే ఈ పుస్తకం.
ఇంకా ఎన్నో యిలాంటి పుస్తకాలు.
అవన్నీ మీరు చదవండి.
వాటిని పిల్లలచే, కొత్తగా చదువనేర్చిన పెద్దలచే,
చదివించండి.
అప్పుడు వారి చదువు తప్పక గట్టిపడుతుంది.
ఆ తర్వాత, వారు ఏ పుస్తకము
అయినా చదువుకోగలరు.
"తెలుగువారిలో చదువురాని వారు ఉండకూడదు"
ఇది మన అందరి నినాదమూ అవాలి.
అందుకోసం మనం పాటుపడాలి.

హరి ఆదిశేషువు

ఆ నా డు

డాక్టర్ ఫ్రాంక్. సి. లాబాక్,

గాడిచర్ల, హరి సర్వోత్తమరావు

లు

పేదలూ నిరక్షరాస్యులూ అయిన వయోజనులు

చదువులు చదివి, అభివృద్ధి చెందాలని

కృషి చేశారు.

ఈ నా డు

డాక్టర్ పాలో ఫ్రెయిరీ.

క్రాస్ సంస్థ డైరెక్టర్, యమ్. కురియన్

లు

పేదలూ నిరక్షరాస్యులూ అయిన వయోజనులు

చదువులు చదివి, అన్ని రంగాలలో అభివృద్ధి చెందాలని

కృషి చేస్తున్నారు.

ఈ నలుగురు మాననీయుల కృషితోనూ నాకు
పరిచయం ఉంది. అంతో ఇంతో సంబంధం ఉంది.
కీ. శే. హరిసర్వోత్తమరావు నాకు మార్గదర్శి; గురుస్థానీయులు.
శ్రీ కురియన్, నా అనురాగాన్నీ కృతజ్ఞతనూ గడించుకున్నారు.
నాకు ప్రీతి పాత్రమైన వయోజన విద్యా ప్రచార
ఉద్యమాన్ని చిత్తశుద్ధితో ఉత్సాహంతో కొనసాగిస్తున్నారు.

అందుచేత -
భక్తిభావంతో చేసిన ఈ రచనను
శ్రీ యమ్. కురియన్ కు
''విజయోస్తు'' అని,
అనురాగ చిహ్నంగా
అంకితం
ఇస్తున్నాను.
హరి ఆదిశేషువు
27-10-1985

# 1. ఎవరీ హరిసర్వోత్తమరావు ?

"వందేమాతరం! ......... మందే రాజ్యం"
అది 1907 ఏప్రిల్.
రాజమండ్రిలో ట్రైనింగు కాలేజి గేటు ముందు
వందలకొద్ది యువకుల ఊరేగింపు.
అందరి చొక్కాలకూ భారతమాత బొమ్మ ఉంది.
దానిలో "వందేమాతరం" అని కూడా ఉంది.
వేలకొద్దీ జనం ఆ ఊరేగింపు చూస్తున్నారు.
"వందేమాతరం" అని కొందరూ,
"మందే రాజ్యం" అని మిగిలినవారూ అరుస్తున్నారు.
చప్పట్లు కొడుతున్నారు.
"ఈ ఊపుతో స్వరాజ్యం వస్తుంది.
తెల్లదొరల పాలన పోతుంది"
అని, ఒకరితో ఒకరు అంటున్నారు.
అక్కడ కాలేజి ప్రిన్సిపాలు రూములో-
తెల్లదొర మార్కుహంటరు-

"ఏమిటీ గడబిడ అంతా
ఎవరీ హరిసర్వోత్తమరావు ?
పో ! కనుక్కో"
అని కోపంతో అరుస్తున్నాడు.
ఆ తెల్లదొర ముందున్న నల్ల గుమాస్తా-
"చిత్తం, చిత్తం" అంటున్నాడు.
"షటప్, పో ! వెంటనే పో !"
అని, దొర అరిచాడు.
గోడమీద ఉన్న గడియారం తిరుగుతోంది.
టైమ్ 11 గంటలైంది.
గుమాస్తా తిరిగి వచ్చాడు.
''సార్ ! ఈ గడబిడకు 'పాల్' మూలకారణం
ఆయన కలకత్తా నుంచి వచ్చాడు.
స్వదేశీ ఉద్యమంలో నాయకుడు
''మనం స్వదేశీ బట్టలే కట్టుకోవాలి.
స్వదేశీ వస్తువులే వాడాలి.
విదేశీ వస్తువులు వాడకూడదు.
బ్రిటీషు వస్తువులు అసలే వాడకూడదు.
ఇదే స్వదేశీ ఉద్యమం, మన వ్రతం.
అందరం ఒక ఏడాది ఇట్లా చేస్తే-

బ్రిటీషువారి వ్యాపారం బాగా దెబ్బతింటుంది.
వారు, మనం చెప్పిన మాట వింటారు.
వారి పరిపాలన పోతుంది.
వందేమాతరం....... మందే రాజ్యం"
అంటూ నిప్పులు కక్కుతూ మాట్లాడుతున్నాడు.
నిన్న సాయంకాలం, ఆయన ఇన్నీసుపేటలో
మాట్లాడాడు.
పట్నంలోని యువకులందరూ విన్నారు.
వారికి ఆవేశం కలిగింది.
తర్వాత, ఆయన విజయవాడ వెళ్ళాడు.
యువకులందరూ ఆయనను సాగనంపారు.
తర్వాత గోదావరిలో స్నానాలు చేశారు.
"వందే మాతరం".
బిళ్ళలు చొక్కాలకు పెట్టుకున్నారు
నినాదాలు చేస్తూ కాలేజీకి వస్తున్నారు; వచ్చారు.
వారందరికీ హరిసర్వోత్తమరావు ముందున్నాడు.
హరిసర్వోత్తమరావు కర్నూలులో పుట్టాడు.
**1883** సెప్టెంబరు **14** ఆయన పుట్టిన తేదీ.
ఆయన తండ్రి వెంకటరావు.
తల్లి భాగీరథీబాయి,

ఆమె చిన్నతనంలోనే చనిపోయింది.
వారి తాతముత్తాతలు ఎప్పుడో మరాటా దేశం నుంచి
తెలుగుదేశం వచ్చినవారట.
ఈయన మొదట, కంభం తాలూకా
రావిపాడులో చదివాడు.
కర్నూలు మునిసిపల్ స్కూలులో చదివాడు.
గుంతకల్లు మిషను స్కూలులో చదివాడు.
ఒక వంక పేదరికంతో పోరాటం
మరొకవంక పట్టుదలతో చదువూ,
1900లో మెట్రిక్ పరీక్ష పాసయినాడు.
రాయలసీమ నుంచి ఆ పరీక్ష పాసయిన వారిలో
ఆయనే మొదటివాడు.
అందుచేత, ఆయనకు
కాలేజీ చదువుకు సాయం దొరికింది.
మదరాసు క్రిస్టియన్ కాలేజీలో చేరాడు.
అక్కడ ఇంగ్లీషు, తెలుగు, చదివాడు.
చరిత్ర, ఆర్థిక శాస్త్రం, రాజకీయ శాస్త్రం కూడా
చదివాడు.
దొరికిన ప్రతి పుస్తకమూ వదలకుండా చదివేవాడు.
తోటివారితో కలిసి మెలిసి ఉండేవాడు.

పెద్దలతో దేశం గురించీ, రాజకీయాల గురించీ,
చర్చలు చేసేవాడు.
మనిషికి తెలివితేటలు ఉంటే, చాలదు.
"ఆరోగ్యం, శరీర బలమూ కూడా ఉండాలి"
అని, దేశీయపు ఆటలు ఆడేవాడు.
తాలింఖానాలో కసరత్తులు చేసేవాడు
1904 లో బి.ఎ. పాసయ్యాడు.
అందులో ఉన్న మూడు పార్టులూ
ఒకేసారి పాసయ్యాడు
ఆ కాలేజీ నుంచి పాసయిన వారిలో
ఈయనే మొదటివాడు.
"రావూ! నీవు బాగా చదువుతావు.
మొదటివాడుగా పాసయ్యావు.
చాలా సంతోషం.
నీ మంచి నీవు చూసుకో.
అంతే కాని, నీకి రాజకీయాలెందుకూ?
రాజకీయాలు ఎవరిని, ఎప్పుడు, ఎట్లా
లాగుతాయో! జాగ్రత్త!"
అని, కాలేజీ ప్రిన్సిపాలు ఈయనకు చెప్పాడట.
అయినా ఈయన తన దారి వదలలేదు.
ఆ క్రిస్టియన్ కాలేజీలోనే యం.ఎ. చదివాడు.
అప్పుడు తెలుగు, కన్నడ భాషలూ

భాషా శాస్త్రమూ చదివాడు.
పరిశోధన చేశాడు.
"కృష్ణదేవరాయలు చక్రవర్తి మాత్రమే కాదు.
కవి చక్రవర్తి!"
అనే పుస్తకం రాశాడు.
యం.ఏ. చదివే రోజులలోనే ఆయన మరో పుస్తకం
కూడా రాశాడట.
"అబ్రహాం లింకన్" జీవిత చరిత్ర.
అందులో
"అబ్రహాం లింకన్" పేదరికం ఎదిరించి
కష్టపడి చదవడం,
రాజకీయాలలో పాల్గొని అమెరికాకు
అధ్యక్షుడు అవడం.
అమెరికాలో బానిసలుగా ఉన్న
నీగ్రో జాతివారికి స్వతంత్రం ప్రకటించడం,
చివరకు తన దేశీయుడి తుపాకి గుండ్ల దెబ్బలకు
ప్రాణాలు అర్పించడం, వివరంగా ఉన్నాయి.
ఆ పుస్తకాన్ని విజ్ఞాన చంద్రికా గ్రంథమాల వారు
అచ్చువేశారు.
దానికి సంపాదకుడు లక్ష్మణరావు పంతులు.
ఆయన దేశభక్తుడు.
ఆ పంతులుగారూ రావుగారూ పరమ మిత్రులు.

హరిసర్వోత్తమరావు ఫిబ్రవరి నెలలో మన
ట్రైనింగు కాలేజీలో చేరాడు.
ఇప్పుడు మేస్టరుగా శిక్షణ పొందుతున్నాడు.
వచ్చిన వెంటనే పేదలవాడలో
ఒక బడి ఏర్పాటు చేశాడు.
అందులో 90 మంది చదువుతున్నారు.
వారందరూ పగలు కూలి నాలి చేసుకుంటున్నారు.
రాత్రి, చదువులు చదువుతున్నారు.
వారికి రావుగారి మాట వేదం.
రావుగారి ఆశయాలు, మాటలు, చొరవ,
ఈ ఉద్యమానికి బలం"
అని, గుమాస్తా చెప్పుకుంటూ పోతున్నాడు.
దొర కొంత విన్నాడు.
అందులో ఆయనకు కొంత తెలిసింది
ఎంతో తెలవలేదు.
అయినా "ఈ హరిసర్వోత్తమరావుకు
గట్టి శిక్ష వెయ్యాలి"
అని, నిర్ణయించుకున్నాడు.
వెంటనే గదిలో నుంచి బైటికి వచ్చాడు.
ఆయన చేతిలో బెత్తం ఉంది.
ఎదర వందేమాతరం బిళ్ళలున్న విద్యార్థులు.
వారిపక్కనే హరిసర్వోత్తమరావు

"ఏమిటివి ? తీసి వెయ్యండి"
అని, దొర కోపంగా అన్నాడు.
"వందేమాతరం"
ఇదేమీ తప్పుమాట కాదు, తప్పుపని కాదు
అన్నాడు. హరిసర్వోత్తమరావు
"రావ్ ! షటప్, గెటవుట్,
నిన్ను ఇప్పుడే డిస్మిస్ చేస్తున్నాను పో !"
అని అరిచాడు.
వెంటనే హరిసర్వోత్తమరావు,
"సార్ ! నేను చెప్పేది......"
"అక్కర్లేదు. నాకు అంతా తెలుసు
నా మాటకు తిరుగులేదు.
గవర్నమెంటు ఆర్డరు తరువాత వస్తుంది"
అని పిచ్చిగా అరిచాడు దొర.
వెంటనే కాలేజీ నుంచి హరిసర్వోత్తమరావూ,
ఆయన వెనుక, మిగిలిన వారూ,
అంతా బైటికి వచ్చేశారు.
దొర, అందరి మీద జరిమానాలు వేశాడు
కాలేజీలో, దొర ఇంటిలో, పట్నంలో,
పోలీసు గస్తీల గడబిడ.
"పెద్దలు మతిచెడి పిరికితనం చూపిస్తారు"
అనే పల్నాటి బాలచంద్రుని మాట మరోసారి

రుజువైంది.
వారం రోజులలో పెద్దలు తమవారిని బెదిరించారు.
క్రమక్రమంగా ఒక్కొక్కరిచేత క్షమాపణ
చెప్పించారు.
కొందరు జరిమానాలు చెల్లించారు.
యువకులు చేపట్టిన స్వదేశీ ఉద్యమం నీరు
కారిపోయింది.
హరి సర్వోత్తమరావు కాలేజీవైపు తిరిగి చూడలేదు.
విజయవాడవైపు చూశాడు.
ఒక మిత్రుడు అయ్యదేవర కాళేశ్వరరావు,
లాయరుగా విజయవాడలో ఉన్నాడు.
మరో మిత్రుడు పట్టాభి సీతారామయ్య,
డాక్టరుగా బందరులో ఉన్నాడు.

# 2. ప్రజా సేవలో సుడిగుండం

హరిసర్వోత్తమరావు బందరు చేరుకున్నాడు.
"బందరులో జాతీయ కళాశాల ఏర్పాటు చేయాలి
అది, జాతీయతను పెంచుతుంది"
అని, లాయరు కోపల్లె హనుమంతరావు,
డాక్టరు పట్టాభి సీతారామయ్య,
కృష్ణాపత్రిక ముట్నూరి కృష్ణారావు, అనుకున్నారు
వారితో హరిసర్వోత్తమరావు కలిశాడు.
జాతీయ కాలేజీ ఏర్పాటుకు కమిటీ ఏర్పడింది
ఈ జాతీయ కళాశాలకు, హరిసర్వోత్తమరావు
ప్రిన్సిపాల్ (కులపతి) అయితే బాగుంటుంది.
కాని, బ్రిటీషు పరిపాలకులతో గిల్లికజ్జా
పెట్టుకున్నట్లే.
సర్వోత్తమరావు, జాతీయ కాలేజీ కమిటీకి
సలహాదారు; కార్యవర్గంలో మెంబరు.
హరిసర్వోత్తమరావు, నిసలైన ప్రజల మనిషి.
జాతీయ కళాశాలకు చందాలు వసూలు చెయ్యగలడు
'పట్టికలో చందాలు వేయించడం,
వాటిని పట్టుదలగా, తిరిగి, వసూలు చేయడం,
నేర్పు, ఓర్పు ఉన్నవారే చెయ్యగలరు.

పరిపాలకులనుకూడా ఈ కాలేజీకి గ్రాంటు
ఇమ్మందాము.
హనుమంతరావు తెలివైన లాయరు
ఎంతటివాడికైనా నచ్చచెప్పగల నేర్పు కలవాడు
అతను కాలేజీకి కులపతి (ప్రిన్సిపాల్) అయితే
బాగుంటుంది.
ఏ ఒడుదుడుకులూ లేకుండా కాలేజీ నడుస్తుంది.
బలంగా పాతుకుపోయిన విదేశీ పరిపాలనను,
యుక్తిగా వెళ్ళగొట్టాలి
అని, కాలేజీ కమిటీ తీర్మానం చేసింది.
కాలేజీ ఏర్పాటయింది.
జాతీయ భావాలు, యువకులలో ప్రచారం
అవుతున్నాయి.
హరిసర్వోత్తమరావుకి చేతినిండా పనిఉండాలి.
లేకపోతే ఆయనకు తోచదు.
ఏదోపని కల్పించుకుంటాడు.
"జాతీయ కళాశాల కోసం చందాలు వసూలు
చేయడం ఒక పనా!
నేను మరోపని కూడా చెయ్యాలి.
బెంగాలు నుంచి తల్వార్ '(కత్తి)'
అనే పత్రిక వస్తోంది.
అక్కడినుంచే 'యుగాంతర్' కూడా వస్తోంది.

అయితే, ఈ రెండూ ఇంగ్లీషు పత్రికలు.
వీటిలో బెంగాలు టెర్రరిస్టుల రచనలే
ఉంటున్నాయి.
వారు విప్లవాత్మక భావాలు ప్రచారం చేస్తున్నారు.
నాకు టెర్రరిస్టుల భావాలూ కార్యక్రమాలూ
తెలియవు.
తెలుగుదేశంలో వాటి ప్రచారం అవసరం.
అవి గ్రామీణ యువకులలో కూడ ప్రచారం కావాలి.
అందుచేత, ఆ పత్రికలోని విషయాలు నేను
చదువుతాను.
వాటిని తెలుగులో రాసి గ్రామాలకు పంపుతాను
ఈ పని, చాటుగా, పోలీసుల కంటబడకుండా
చెయ్యాలి.
ఇది యువకులకు సవాలువంటి కార్యక్రమం."
అని, ఆలోచనలు చేశాడు; కార్యక్రమం నడిపించాడు
బెంగాలు నుంచి కొందరు టెర్రరిస్టులు
అప్పుడప్పుడు విజయవాడ వచ్చేవారు.
వారితో హరిసర్వోత్తమరావు చర్చలు చేసేవాడు.
"ఈ టెర్రరిస్టుల ఉద్దేశాలు మంచివే.
వారి త్యాగబుద్ధి మెచ్చదగిందే.
కాని, వారి కార్యక్రమంలో లోపం ఉంది.
ఎవరో కొందరు టెర్రరిస్టులు,

కొందరు నిరంకుశులను ఎన్నుకొని చంపడం,
తాము ఉరికంబాలు ఎక్కడం,
లేదా, తప్పించుకుని, దాగివుండి,
ఏమీ చేయలేకపోవడం, జరుగుతున్నాయి.
రాజకీయ విజయం సాధించడానికి ఇది పద్ధతి కాదు.
అందుచేత, నాకు ఈ దారి నచ్చలేదు.
నా దారి నేను చూసుకోవాలి"
అని, హరిసర్వోత్తమరావు నిశ్చయించుకున్నాడు.
లోకమాన్యతిలక్-'కేసరి', 'మరాటా' పత్రికలకు
సంపాదకుడు.
"స్వరాజ్యం మన జన్మహక్కు
మనం అది సాధించి తీరాలి"
అని, గర్జన చేస్తున్నారు.
ఆయన మరాటా దేశంలో ప్రజలలో జాతీయత
పెంచుతున్నారు.
మన తెలుగులో దినపత్రికలు లేనేలేవు.
బందరు నుంచి వచ్చే కృష్ణాపత్రిక, వారపత్రిక.
అందులో ఉన్న చోటును వారు ఎన్నో విషయాలకు
పంచుతారు.
వాటిలో రాజకీయాలు ఒకటి.
అందుచేత, పూర్తిగా రాజకీయాలకోసం, ఒక పత్రిక
ఉండాలి.

ఒక పత్రికకూ, మరొక పత్రికకూ పోటీలేదు.
ఏ పత్రిక చదివే వారు ఆ పత్రిక చదువుతారు.
కొందరు రెండూ చదువుతారు."
వెంటనే, హరిసర్వోత్తమరావు పత్రికా రంగంలో ప్రవేశించారు.
'స్వరాజ్య' వారపత్రిక విజయవాడ నుంచి ప్రచారం మొదలు పెట్టింది.
దానికి అచ్చాఫీసు, సహచరులు, సమకూడారు.
'స్వరాజ్య' చదివేవారి నంబరు క్రమంగా పెరుగుతోంది.
ఆ పత్రిక అమ్మకం వల్ల వచ్చే రాబడి కూడా పెరుగుతోంది.
హరిసర్వోత్తమరావు 1907 మే లో రాజమండ్రి వదిలారు.
అప్పటి నుంచీ కూడా పోలీసుల చూపు ఈయనపైన ఉంది.
"ఈయన ప్రమాదకరమైన యువకుడు.
తెల్లదొరనే ఎదిరించాడు.
ఈయన ఏమి చేస్తున్నాడు ? ఎవరితో ఏమి మాట్లాడుతున్నాడు ?
ఏమి రాస్తున్నాడు ?"

అని, మనం పరిశీలనగా చూస్తూ ఉండాలి.
దొరికితే రాజద్రోహనేరం మోపుదాము.
అది రుజువయితే మనకు లాభం"
అని, పోలీసువారు పొంచి చూస్తూ ఉన్నారు.
"మే 1908 లో మనం శివాజీ ఉత్సవాలు చేద్దాము"
అని, విజయవాడలో యువకులు ఏర్పాటు చేశారు.
"మీరు. శివాజీని గురించి ఉపన్యాసం ఇయ్యండి"
అని, వారు హరిసర్వోత్తమరావును అడిగారు.
ఆయన "సరే" అన్నారు.
"శివాజీ మరాటా వీరుడు.
మొగలు చక్రవర్తి, ఔరంగజేబును ఎదిరించాడు.
స్వంతరాజ్యం ఏర్పాటు చేసుకుని
'ఛత్రపతి' అయ్యాడు.
ఆయన మనకు మార్గదర్శి."
అంటూ శివాజీ నాటి రాజకీయాలను, వివరించాడు,
ఈనాటి రాజకీయాలతో లంకెవేసి,
వెటకారంగా వివరంగా మాట్లాడాడు.
విన్నవారిని నవ్వించి, రోషం తెప్పించారు.
ఆ సభకు సి.ఐ.డి. పోలీసులు వచ్చారు.
వారు వివరంగా రిపోర్టు రాసుకున్నారు; చదివారు.
ఈ హరిసర్వోత్తమరావు చాలా తెలివైనవాడు.
మన ఎదటే రాజద్రోహం ప్రచారం చేశాడు.

కాని, దానికి రుజువు లేదు;
ఈయన 'చిక్కడు, దొరకడు.'
అని, 'స్వరాజ్య' పత్రిక పాత కాపీలు అన్నీ చదివారు.
మార్చి 26, 1908 సంచికలో 'విపరీతబుద్ధి' అనే వ్యాసం ఉంది.
అది చదివిన వెంటనే-
'వినాశకాలం వచ్చినప్పుడు బుద్ధి విపరీతమవుతుంది.'
అనే సామెత గుర్తు వస్తుంది.
ఆ తరవాత, "ఇంగ్లీషు పరిపాలనకు వినాశకాలం దగ్గరపడింది.
అందుచేతనే వారు ఇట్లాంటి పిచ్చిపనులు చేస్తున్నారు"
అని, ఒకరితో ఒకరు చెప్పుకుంటారు.
ఇది కనిపించని రాజద్రోహం; ఇదిచాలు, మనం కేసుపెట్టి రుజువు చేసేటందుకు.
రావుకి జైలు శిక్ష తప్పదు.
అని, వారు నిశ్చయించారు.
అందుచేత, హరిసర్వోత్తమరావు రాసింది మనం చదవాలి.
కాని, అంతకంటె ముందుగా మనం ఆ రచనలో ఉన్న ఆవేశానికి కారణం పూర్తిగా తెలుసుకోవాలి.

అప్పుడే మనం ఆయన దేశభక్తి, తెగింపు, ఆవేశం,
తెలుసుకోగలం.
1600 ప్రాంతంలో ఇంగ్లీషు వారు,
వ్యాపారం చేద్దామని మనదేశం వచ్చారు.
ఆ తరవాత, రాజకీయాలలో తలదూర్చారు.
క్రమక్రమంగా 1800 నాటికి పూర్తిగా మనదేశం
జయించారు.
అందుచేత, అధికారం వారిదయింది.
ఆ వివరాలు అన్నీ, మనం చరిత్ర చదివి
తెలుసుకోవచ్చు.
మన దేశంలో, వ్యాపారం కూడా పూర్తిగా ఇంగ్లీషు
కంపెనీల పరం అయింది.
ఇంగ్లీషు వారు, కొనడం, అమ్మడం, వారి తొత్తుల
ద్వారా సాగించేవారు.
సరకుల రవాణా కూడా వారి
ఓడల కంపెనీలు, రైలు కంపెనీలు, చేసేవి,
ఓడల కంపెనీలు అన్నీ వారివే.
అది వారి గుత్త వ్యాపారం అయింది.
వారితో ఎవరూ పోటీ చేయలేకపోయేవారు.
ఇప్పుడు సాధారణంగా నౌకలమీద విదేశాలకు
సరుకులు రవాణా చేస్తారు.
కాని, మనదేశం షావుకార్లు, ఎన్నో వందల

ఏండ్లుగా విదేశాలతో వ్యాపారం చేస్తున్నారు.
మన తెరచాపకొయ్యల ఓడలు ద్వీపాంతరాలకు
పోయేవి.
అక్కడికి సరుకులు కొనిపోయేవి.
అక్కడి నుంచి సరుకులు తెచ్చేవి.
మొత్తంమీద, ఇంగ్లీషువారి అధికారం, పొగ ఓడలు,
విదేశీ గుత్తకంపెనీలు, చేతులు కలిపాయి.
మనదేశ వ్యాపారాన్ని మూలకు తోశాయి.
"ఇది ఎంతో అన్యాయం.
జాతికే అవమానం"
అని, మన దేశీయులు అందరూ కుత కుత
ఉడికిపోయారు.
అటువంటి వారిలో చిదంబరం పిళ్ళె ఒకడు.
"ఈ పాతకాలపు ఓడలతో ఇక లాభం లేదు"
అని, ఆయన చొరవచేసి ఒక చిన్న
పొగఓడ కొన్నాడు.
రవాణా కంపెనీ పెట్టాడు.
మన తూర్పు తీరపు రేవులలో జరిగే వ్యాపారంలో
నిలదొక్కుకున్నాడు.
దొరల పోటీ ఉన్నా కూడా
మంచి లాభాలు, గడించాడు.
మరో రెండు ఓడలు కొన్నాడు.

బ్రిటీష్ కంపెనీల కండ్లు కుట్టాయి.
"ఈ చిదంబరం పిళ్ళైను ఎట్లాగైనా
అణగతొక్కండి"
అని, అధికారంలో ఉన్న తెల్లదొరలను,
కంపెనీలవారు కోరారు.
చిదంబరం పిళ్ళైకు, తూత్తుకుడిలో,
తిరునల్వేలిలో, ఇంకా ఇతర పట్నాలలో,
బ్రాంచి ఆఫీసులు ఉన్నాయి.
"చిదంబరం రాజద్రోహం చేశాడు".
అని, పోలీసులు నేరంమోపి, తూత్తుకుడిలో
అరెస్టు చేశారు.
"ఇది అన్యాయం" అని, ప్రజలు అల్లర్లు చేశారు.
ఆ ప్రజలమీద పోలీసులు కాల్పులు జరిపారు.
తిరునల్వేలిలో కూడా
అల్లర్లూ, కాల్పులూ జరిగాయి.
తుపాకీ గుండ్లు తగిలి, ఐదుగురు చనిపోయారు.
ఇంకా ఎందరికో గాయాలు తగిలాయి.
ఇంగ్లీషు దినపత్రికలలో ఈ వార్తలు వచ్చాయి.
అవి చదివిన హరిసర్వోత్తమరావు మనస్సు,
కలత చెందింది.
ఆయనకు కోపం, ఆవేశం కలిగాయి.
"అరే ఫరంగీ! ఏమీ ఎరగనివారిని కాల్చి

చంపావురా !
నీవు చేసిన చట్టాలనే నీవు తోసి పారేశావురా !
మా జాతీయత పీక పిసికివేస్తున్నావురా !
మాలో జాతీయత పెరిగితే
నీకు చోటు ఉండదనే పిరికితనం,
నీ పరిపాలనకు గండం అనే భయం,
నీలో కనిపిస్తున్నాయిరా !
ఇదేమి విపరీతపు బుద్ధిరా ?
నీకు వినాశకాలం దగ్గర పడుతుందని రుజువు."
అని, తన పత్రికలో రాశారు.
"ఇది మనకు చాలు.
అయినా, మరో రెండు రచనలను దీనితో
కలుపుదాము.
రాజద్రోహం కేసు మోపవచ్చు."
అని, పోలీసులు నిశ్చయం చేశారు.
జూలై 13, 14, తేదీలలో పోలీసులు 'స్వరాజ్య'
ఆఫీసు మీద దాడి చేశారు.
552 కాగితాలు తీసుకున్నారు.
హరిసర్వోత్తమరావు డైరీ లాగుకున్నారు.
బట్టలు, సామానులు, అన్నీ దోచుకున్నారు.
మిగిలినవి చిందర వందర చేశారు.
ఆయనను అరెస్టు చేసి లాకప్‌లో ఉంచారు.

39 రోజుల లాకప్ తర్వాత, జైలులో వేశారు.
హరిసర్వోత్తమరావుతోపాటు,
బోడి నారాయణరావును కూడా
అరెస్టు చేశారు.
"స్వరాజ్య" పత్రికలో పింగళి లక్ష్మీనారాయణకు
వాటా ఉంది.
ఆయనకు స్వదేశీ స్టోర్సు కూడా ఉంది.
అతనిని కూడా అరెస్టు చెయ్యాలి.
అని, ఆయన స్టోర్స్ మీద దాడి చేశారు.
కాని, ఆయన దొరకలేదు.
ముందు పసికట్టి, పాండిచేరి చేరుకుని,
అక్కడే ఉండిపోయాడు.
పోలీసులు రెండు కేసులు పెట్టారు.
బోడి నారాయణరావు మొదటి ముద్దాయి,
ఆయన స్వరాజ్య పత్రిక సంపాదకుడు,
అచ్చు వేసిన ప్రింటరు.
హరిసర్వోత్తమరావు స్వరాజ్య పత్రిక అధిపతి;
ప్రొప్రైటరు.
ఈ ఇద్దరూ చేసిన నేరం చాలా పెద్దది-రాజద్రోహం.
మొదట మేజిస్ట్రేట్ విచారణ జరిపారు.
పోలీసులకు హరిసర్వోత్తమరావు మీదనే ఎక్కువ కసి.

"హరిసర్వోత్తమరావు మీద కేసు గట్టిపరిచి,
రుజువు చెయ్యాలి.
దానికి బోడి నారాయణరావును పురిగొల్పుదాము.
ఆశలు కలిగిద్దాము"
అని, వారు ఆలోచనలూ, ప్రయత్నాలూ చేశారు.
బోడి నారాయణరావు, ఒక స్టేటుమెంటు కూడా
ఇచ్చాడు.
మేజిస్ట్రేటు విచారణచేసి, "కేసులు రుజువయ్యాయి.
పూర్తి విచారణ, సెషన్సు జడ్జి చెయ్యాలి.
ఆయనే ఈ కేసులో తగిన శిక్షలు వెయ్యగలరు"
అన్నాడు.
కేసులు సెషన్సులో విచారణకు వచ్చాయి.
జడ్జి: పి. కెర్షాస్ప
ఆయన ఐ. సి. యస్. ఆఫీసరు.
ఆయన పార్సీవాడు; పెద్దమనిషి;
తూచి, న్యాయం చెప్పేరకం.
ఆయన చేసిన విచారణ రిపోర్టు, చక్కని రచన.
అది ఆయన న్యాయశీలం వివరంగా తెలిపే రుజువు.
మనకు లోకం పోకడ తెలిపే న్యాయపత్రం.
ఈ కేసులు నడచిన రోజులు, హరిసర్వోత్తమరావుజీకి
ఎంతో కష్టకాలం.
దగ్గరి మిత్రుడే శత్రువు అయినకాలం.

బోడి నారాయణరావు తన తోటిముద్దాయి;
తనతో వాటాదారు.
అయినా, ఆయన "ఈ నేరం నాది కానేకాదు.
నేను నిజంగా సంపాదకుడినే కాను.
నెలకు 15 రూపాయల జీతం మీద
పనిచేసే గుమాస్తాను మాత్రమే.
ఎవరయినా నాకు ఇచ్చిన రచనలు
అట్లాగే అచ్చుకు ఇవ్వడమే నేను చేసినపని"
అని, నేరం పూర్తిగా
హరిసర్వోత్తమరావు మీదికి తోశాడు.
కాని, కేసు విచారణలో
'బోడి నారాయణరావు మంచి ఉపన్యాసకుడు;
దేశాలు తిరిగినవాడు;
ప్రజలను రెచ్చగొట్టే రీతిలో,
ఆవేశంగా మాట్లాడగలడు'
అని, రుజువైంది.
ఈ కేసుల్లో పోలీసులు, 23 మంది సాక్షుల్ని
విచారించమన్నారు.
ముద్దాయిలు, 11 మంది సాక్షుల్ని
విచారించమన్నారు.
సాక్షులలో మదరాసు క్రిస్టియను కాలేజి
ప్రిన్సిపాల్, డాక్టర్ స్కిన్నర్, ఉన్నారు.

రాజమండ్రి ట్రైనింగు కాలేజీ
వైస్ ప్రిన్సిపాల్, ఉన్నారు.
తిరునల్వేలిలో కాల్పులు జరిపిన
పోలీసు ఆఫీసరు ఉన్నారు.
'స్వరాజ్య' పత్రిక గురించి అన్నీ తెలిసినా,
నాకు ఏమీ తెలియదని చెప్పిన వీరమల్లయ్య ఉన్నారు.
ఆ విచారణ అంతా నాలుగు నెలలు జరిగింది.
జడ్జి, కారణాలు వివరంగా చెప్పుతూ-
తాను విచారించిన రెండు కేసులూ నిజంగా
ఒక కేసే అనీ,
మొదటి ముద్దాయి చెప్పిన సాకులు
తోసి వేస్తున్నాననీ,
నేరం, ఆవేశంలో జరిగింది అనీ,
పూర్తి లోకజ్ఞానం లేని యువకులు చేసిన
మొదటి నేరం అని భావిస్తున్నాననీ,
మొదటి ముద్దాయికి తొమ్మిది నెలలూ
హరిసర్వోత్తమరావుకి ఆరు నెలలూ-
జైలు శిక్ష చాలునని-తీర్పు యిచ్చారు.
అది విని, పోలీసులు నీరు కారిపోయారు.
అందుచేత, హైకోర్టుకి అపీలు చేశారు.
అక్కడి జడ్జీలు, పరిపాలకులలో మరింత పెద్దవారు.
వారు హరిసర్వోత్తమరావుకు మూడేండ్లు

కఠినశిక్ష వేశారు.
పోలీసులు 'ఇప్పటికిది చాలు.
తర్వాతి సంగతి తర్వాత చూసుకోవచ్చు'
అని, ఊపిరి పీల్చుకొన్నారు.
హరిసర్వోత్తమరావుకు, 'లోకమాన్య తిలక్' ఒరవడి.
ఇద్దరూ ఒకే రోజున, ఒకే నేరానికి, ఒకే సెక్షన్
(123-ఎ) కింద అరెస్టయ్యారు.
అప్పుడు 'లోకమాన్య' నడివయసు దాటినవాడు;
జగమెరిగిన పండితుడు.
మన హరిసర్వోత్తమరావు 25 ఏండ్ల యువకుడు;
పేరు తెచ్చుకుంటున్న యువ రచయిత
కొత్తగా పెండ్లి చేసుకున్న కుటుంబి.
ఇద్దరూ కఠిన శిక్షలకు గురి అయ్యారు.
హరిసర్వోత్తమరావు ఏమీ జంకలేదు.
భార్య, 16 ఏండ్ల రామాబాయిని
తులసిపూజ చేసుకునేటందుకూ
తన ఫోటో అలంకరణకూ వదిలి,
చిరునవ్వుతో జైలులో అడుగుపెట్టాడు.
ఆయన, జైలులో
సుమారు 1200 రోజులు గడిపాడు.

వాటిలో ప్రతిరోజూ ఒక యుగం, ఒక కఠిన పరీక్ష.
అన్ని రోజులూ అవమానాలతో నిండిపోయినవే.
వాటిని గురించి ఆయన ఎక్కడా వివరంగా
రాయనూ లేదు, చెప్పనూ లేదు.
కాని, వాటిలో ఏవో కొన్ని, గుర్తుంచుకొన్న
వాటిని, మాత్రమే రేడియోలో చెప్పిన నిగర్వి.
ఆయన శిక్షా కాలంలో గడిపిన జీవితం
దర్శి చెంచయ్య వివరించారు.
జైలులోకి రాగానే హరిసర్వోత్తమరావుకు
రెండు గోచీలు ఇచ్చారు.
మూరెడు చదరంగా ఉన్న,
రెండు తువ్వాళ్ళు ఇచ్చారు.
"నీవు కట్టుకున్న బట్టలు తీసివెయ్యి.
జైలులో ఇవీ నీ బట్టలు. ఇంతే."
అని, చెప్పి, అమలు చేయించారు.
పండుకొనుటకు ఒక చిన్న, ఈతాకుల చాప.
అన్నం తినడానికి ఒక మట్టి చట్టి.
మంచినీరు త్రాగడానికి ఒక మట్టి ముంత.
అర్జంటు అయితే మలమూత్రాలు వదలడానికి
మరో మట్టి కుండ.

ఇవీ జైలులో ఆయన ఫర్నిచరు; పాత్ర సామగ్రి.
ఆయనకు కొన్ని అలంకారాలు
అంటే నగలు కూడా ఇచ్చారు.
అవి : కాలికి ఒక లావుపాటి ఇనప కడియం
మెడకు మరో ఇనప కడియం
అందులో ఒక కొయ్య ముక్క దూర్చి,
దానిమీద ఆయన నెంబరు వేశారు.
ఆయన మరోకొత్త అలవాటు చేసుకోవలసి వచ్చింది.
అధికారులు ఏర్పాటు చేసిన టైముకే
మలమూత్ర విసర్జన.
అప్పుడు కాకపోతే జైలులో
తన చట్టిలోనే అది జరుపుకొనడం
రోజంతా వాటి వాసనలో గడపడము.
చదువుకునేటందుకు పుస్తకాలు లేవు; ఇయ్యరు.
మూడు నెలలకు ఎవరికైనా
ఒక ఉత్తరం రాయవచ్చు
ఒకే ఒక ఉత్తరం అందుకోవచ్చు.
మొలతాడూ జందెమూ ఉండకూడదు
జుట్టు పెరగకూడదు. బోడిగుండు తల.
ఇదీ జైలులో రూపం, వేషం, కట్టు, జుట్టు,

ఇక తినడానికి, రాగి సంకటి ముద్ద.
అందులో రాళ్ళు, మట్టి, పుల్లలు.
దానితో అనుపానంగా
ఆకులు, అలమువేసి, కాచిన రుచిలేని నీరు.
అది రసం అనుకుంటే రసం.
పులుసు అనుకుంటే పులుసు.
ఆ రసంలో చచ్చిన పురుగులు తేలుతూ.. ...
ఛీ ఎంత వెగటైన తిండి !
ఏమిటి, లోకంతో సంబంధం లేని ఈ బతుకు ?
ఇదేమి బతుకు; ఎంత ఓర్చినా పిచ్చెక్కించే బతుకు.
అని, ఆయనకు అనిపించింది.
"మేము మనుషులం. జైలులో కూడా
మనుషుల్ని మనుషులుగా చూడాలి.
ఇదే మా కోరిక"
అని, హరిసర్వోత్తమరావు, జైలు చూసేటందుకు
వచ్చిన గవర్నరుతో చెప్పాడు.
ఆ గవర్నరు తెల్లదొర.
అధికారంతో మదించినవాడు.

'షటప్' అని, బండతిట్లు, తిట్టిపోయాడు.
జైలులో హరిసర్వోత్తమరావుకు వేసింది కఠిన శిక్ష.
అందుచేత, ఆయన రోజూ
కొంత బరువైన కాయకష్టం చెయ్యాలి.
కనక, ఆయనకు కంబళీలు నేసే పని చెప్పారు.
ఆయన కాయకష్టం చేసినవాడు కాదు,
కంబళీ నేత అసలే ఎరుగడు.
ఆ పని, ఆయనకు 'ఎరుకల సుంకడు' నేర్పాడు.
ఎరుకల సుంకడు బందిపోటు దొంగ.
నేరం చేసి జైలులో పడ్డాడు.
అప్పటికి ఎనిమిదేండ్ల శిక్ష అయింది; ఇంకా వుంది.
అతనికి హరిసర్వోత్తమరావు అంటే గౌరవము.
అందుచేత, ఆయనకు పని నేర్పడమేకాదు.
ఆయన రోజూ చేయవలసిన పని కోటా కూడా
తానే పూర్తి చేసేవాడు.
ఈ రీతిగా హరిసర్వోత్తమరావుకు జైలులో
అదనపు శిక్ష పడకుండా చూశాడు.
"ఎరుకల సుంకడు నాకు ఎంతో ఉపకారం చేశాడు.

అతనిని నేను ఎట్లా మరువగలను ?"
అని, హరిసర్వోత్తమరావుగారు తర్వాత కాలంలో
కృతజ్ఞతాంజలి ఘటించారు.
ఇట్లా, కఠిన నరకంలా గడచి
జైలు శిక్ష పూర్తి అయింది.
విడుదల రోజు వచ్చింది.
జైలు బట్టలుతీసి పారేసి హరిసర్వోత్తమరావు
తన బట్టలు వేసుకున్నాడు.
ఆయనకు రామాబాయి
చిరునవ్వుతో స్వాగతం చెప్పింది.
ఇద్దరి ఎడబాటూ ముగిసింది.
హరిసర్వోత్తమరావు-
"వందేమాతరం" 'స్వరాజ్యం మన జన్మహక్కు"
ఒక జాతి మరొక జాతిని 'అణగతొక్కడం
అన్యాయం' అని,
భావించినందుకూ, చెప్పినందుకూ,
రాసినందుకూ—
నిజంగా కఠినమైన జైలు శిక్ష అనుభవించాడు.

చిన్న జైలు నుంచి బయటపడి, పెద్ద జైలులో తిరిగి
మనతో కలిశాడు.
‘‘ఇకముందు ఏమి చేస్తావు ?
ఏమి చేయగలవు ?’’
అంటూ ఎదురైన ప్రశ్నలను
ఆయన వెంటనే ఎదుర్కొనవలసి వచ్చింది.

# 3. ఉద్యమాల కెరటాలలో ఈదులాటలు

రావుగారు నెల్లూరు జైలు నుండి బైటికి వచ్చారు.
అక్కడినించి మదరాసు చేరుకున్నారు.
మిత్రులు లక్ష్మణరావు, మునగాల రాజాగార్లు
ఆయనకు వసతి ఏర్పాటు చేశారు.
విజ్ఞానచంద్రిక పనులే ఆయన పనులయ్యాయి.
విజ్ఞానచంద్రిక ప్రచురణలు ఒక ఉద్యమంగా
సాగడం మొదలు అయింది.
రావుగారు 'ఢిల్లీ దర్బారు' అనే పుస్తకం రాశారు.
దాన్ని విజ్ఞానచంద్రిక అచ్చు వేసింది.
అందులో ఢిల్లీ నగర యుగయుగాల చరిత్ర ఉంది.
ధర్మరాజు పట్టాభిషేకం నుంచి
ఐదవ జార్జి చక్రవర్తి పట్టాభిషేకం వరకు ఉంది.
చక్కని పుస్తకం.
దీన్ని రావుగారు రచించినట్లు వేస్తే
అచ్చువేసిన మన సంస్థకు ఏమవుతుందో !
అవి ఎవరైనా కొన్నట్లు, చదివినట్లు, పోలీసులకు
తెలిస్తే ఆ పని చేసిన వారికి ఏమవుతుందో !

క్రారే రాజులు, వారు రాజ్యాలు పాలించలేదా ?
ఏది శాశ్వతం ? ఈ బ్రిటీషు ప్రభుత్వం శాశ్వతమా ?
అనే ప్రచారమూ, రాజద్రోహమూ
ఈ పుస్తకంలో ఇమిడి ఉన్నాయి.
ఇందులో, పైకి రాజభక్తి,
ముసుగులో రాజద్రోహమూ, ఉన్నాయి.
ఇదేకదా రావుగారి రచనా ధోరణి.
అని, పోలీసులు అందరినీ ముట్టడిస్తారేమో !
మనం వారితో గిల్లికజ్జా పెట్టుకోవద్దు.
అని, ఆ పుస్తకం 'రావుగారి రచన'
అని అచ్చు వెయ్యలేదు.
దీనికి లక్ష్మణరావు 'సంపాదకుడు' అన్నారు.
ఆ రోజులు అటువంటివి.
రావుగారితో మాట్లాడితే పోలీసులు అనుమానిస్తారు.
'రాజద్రోహి' అంటారు.
అని, ఎందరో మిత్రులు, తప్పుకొని తిరిగేవారు.
రావుగారికి కావలసింది పని, కీర్తి కాదు.
అందుచేత, ఆయన పని గురించే ఆలోచనలు చేశారు.
తెలుగులో 'విజ్ఞాన సర్వస్వం తయారు కావాలి'.
ప్రజలే దాని అచ్చును గురించి ముందుకు రావాలి.

దానికి ఇదీ నా ప్లాను :-
మనం నెలకు 100 పేజీలు తయారు చేద్దాము.
ఇదిగో మన మిత్రుల పేర్ల పట్టిక
ఇందులో ఇరవై మంది పేర్లు ఉన్నాయి.
వీరిలో ఒక్కొక్కరు 100 రూపాయలు ఇస్తారు.
మొదటి నూరు పేజీలూ అచ్చువేద్దాము.
వాటి అమ్మకంతో వచ్చిన సొమ్ముతో,
తరవాత నెలలో తరవాతి 100 పేజీలు.
ఇదీ వరస. ఇదే నా ప్లాను. ఏమంటావు? అని
లక్ష్మణరావుగారితో రావుగారు అన్నారు.
'బాగుంది. నీవూ, నేనూ, ఈ అచంట లక్ష్మీపతీ
చాలు ఈ పనికి'
అని లక్ష్మణరావు అన్నారు.
పని మొదలు అయింది.
తర్వాత రెండు సంపుటాలు కూడా వచ్చాయి.
ఆ రోజుల్లో ఇద్దరు రావు గార్ల దినచర్యా -
'కన్నెమరా' లైబ్రరీలో చదవడం,
ముందు నోట్సు,
తర్వాత వ్యాసాలు రాయడం- అయింది.
ఒకవంక విజ్ఞాన సర్వస్వం పని

మరొక వంక ఆంధ్రుల చరిత్ర; విజ్ఞాన శాస్త్రాలపై
గ్రంథాలు; విజ్ఞానచంద్రిక చరిత్రాత్మక నవలలు.
ఎన్నో అనుబంధ రచనలు- హిందూ మహాయుగం,
మహమ్మదీయ మహాయుగం, మరాటా దేశచరిత్ర-
విజ్ఞానచంద్రిక రాయించింది; ప్రకటించింది;
ప్రతి గ్రామానికీ చేరే ఏర్పాట్లు చేసింది.
ఆ ఉద్యమం ఉవ్వెత్తుగా
లక్ష్మణరావుగారున్నంత వరకూ
(జూలై 1923) సాగింది.
ఆ తర్వాత కూడా సాగింది.
కాని, అందులో పూర్వపు
ఊపూ బరువూ లేవేమో అనిపిస్తుంది.
ఆంధ్రపత్రిక, మొదట బొంబాయిలో
వారపత్రికగా ఏర్పాటైంది.
దాన్ని స్థాపించిన వారు దేశోద్ధారకులు;
కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు.
ఆయన విశ్వదాత; అమృతాంజన ప్రదాత.
1914లో ఆయన తన వ్యాపారాన్ని
బొంబాయి నుంచి మదరాసు మార్చారు.
దానితో పాటు
'ఆంధ్ర పత్రిక' కూడా మదరాసు వచ్చింది.

దినపత్రికగా అభివృద్ధి చెందింది.
పంతులు గారికి
హరిసర్వోత్తమరావు అంటే అభిమానం.
"ఆంధ్రులకు, త్యాగమార్గాన్ని చూపింది
రావుగారి జీవితం"
అని, మెచ్చుకుంటూ పత్రికలో
ఒకసారి సంపాదకీయం కూడా రాశారు.
అంచుచేత, ఆయన రావుగారికి కబురు చేశారు.
మీరు 'ఆంధ్రపత్రిక'కు
సంపాదకుడుగా ఉండండి అని, చెప్పారు.
రావుగారు ఒప్పుకున్నారు.
సంపాదకీయం శీర్షికకు ఒక చక్కని
ఒరవడి ఉంటే మంచిది.
అని, ఆయన ఆలోచన చేశారు.
భారతంలో ఉన్న ఒక పద్యాన్ని ఎన్నుకున్నారు.
ఆ పద్యంలోని భావం ఇదీ :
"ఎవరైనా ఏ పని చేస్తే
మన మనస్సుకి కష్టం కలుగుతుందో
మనం ఆ పని చేసి,
ఇతరుల మనస్సులకు కష్టం కలిగించకూడదు".
ఈ ఒక్క పద్యంలోనూ కొండంత అర్థం ఇమిడిఉంది.

ఇందులోనే సామాజిక న్యాయమూ
సోషలిజమూ ఇమిడి ఉన్నాయి.
ఈ పద్యం నీడలో మూడేండ్లు, హరిసర్వోత్తమరావు
రోజూ తన సంపాదకీయాలు రాసేవారు
తెలుగుదేశంలో రాజకీయ చైతన్యం కలిగించారు.
ఆ రోజుల్లోనే పింగళి వెంకయ్య
జాతీయ జెండా రూపొందించారు.
వారికి, మన రావుగారు తన సలహాలుకూడా ఇచ్చారు.
అంతేకాదు, "మహిళలలో చైతన్యం కలగాలి.
దానికి మహిళలే పూనుకోవాలి".
అని, రావుగారి నమ్మకం.
అందుచేత, శ్రీమతి రామాబాయితో 'సౌందర్యవల్లి'
అనే మాసపత్రిక ఏర్పాటు చెయ్యి అన్నారు.
ఆ పనిలో ఆమెకు తాను ఆసరాగా నిలిచారు.
"తెలుగు ప్రజలు మాట్లాడే తెలుగు చక్కని తెలుగు.
తెలుగు పుస్తకాలలో ఉన్న తెలుగు
దానికి దూరంగా ఉంది.
అది అసహజం.
మాట్లాడే భాషా, రాసే భాషా ఒకే రీతిగా ఉండాలి.
అప్పుడే ప్రజలలో చదువులూ తెలివితేటలూ
పెరుగుతాయి".

అని, గిడుగు వెంకటరామమూర్తి పంతులు
ఒక ఉద్యమం లేవదీశారు.
పండితులూ, పాత కాలం భాష అంటే
మోజు ఉన్నవారూ ఆ వాదాన్ని ఎదిరించారు.
వారిలో మహామహోపాధ్యాయ
వేదం వెంకటరాయశాస్త్రి ఒకరు.
రావుగారు, శాస్త్రిగారి దగ్గర చదివారు.
అంతేకాదు, స్వయంగా కూడా రావుగారు
చక్కని పండితులు; భాషా శాస్త్రవేత్తలు,
అందుచేత, ఆయనకు గిడుగు రామమూర్తిగారి
ఉద్యమం మొదట నచ్చలేదు.
మునగాల రాజావారు ఒకసారి తన ఇంట్లో రామ
మూర్తి, రావుగారు, కలుసుకునే ఏర్పాటు చేశారు.
అప్పుడు ఆ ఇద్దరూ చాలాసేపు వాదించుకున్నారు.
ఎవరి వాదం వారు గట్టిగా చెప్పారు.
చివర, రామమూర్తి పంతులు, "రావుగారూ మీరు
ఎంతోసేపు చక్కని తెలుగులో మాట్లాడారు.
అది, విన్నవారికి వెంటనే అర్థమవుతుంది.
రాయడం కూడా అట్లాగే రాయండి.
అప్పుడది చదివిన వారికి వెంటనే అర్థమవుతుంది.

అదేకదా మనం కోరేదీ కోరవలసిందీ" అన్నారు.
ఆ మాటలకు జవాబు చెప్పడానికి
రావుగారికి ఏమీ తోచలేదు.
నాలుగేండ్లు ఆలోచన చేశారు.
రామమూర్తి పంతులు వాదమే సరి అయినది.
అనే నిశ్చయం చేసుకున్నారు.
అంతే, అప్పటి నుంచీ రావుగారి రచనలు
ప్రజల భాషలోనే సాగాయి.
వినదగు నెవ్వరు చెప్పిన :
వినినంతనె వేగపడక,
వివరంగా ఆలోచన చెయ్యాలి.
ఇట్లాచేసి, కల్ల, నిజములు తెలిసికొన్న
మనుజుడే నీతిపరుడు.
ఇదే సర్వోత్తమరావు నమ్మారు.
ఇదే సుమతి చెప్పిన దారి.
గాంధీజీ దక్షిణ ఆఫ్రికాలో భారతీయుల
హక్కుల కోసం 1901 నుంచి 1914 వరకు
పోరాటాలు సాగించారు.
విజయం సాధించి 1915 మే లో
మనదేశం తిరిగి వచ్చారు.

**1914** నుంచి **1918** వరకూ మొదటి ప్రపంచ
యుద్ధం నడిచింది.
"ఇప్పుడు బ్రిటీషు వారు
జర్మనులతో యుద్ధం చేస్తున్నారు.
ఇది వారికి కష్టకాలం.
మనం, వారితో ఇప్పుడు పోరాటం జరపడం
ధర్మం కాదు". అని,
గాంధీజీ అనుకున్నారు.
బెసెంటు దొరసాని ఐర్లండులో పుట్టింది.
కాని, ఆమెకు మనదేశం సంస్కృతీ
మతమూ నచ్చాయి.
అందుచేత, ఆమె మనదేశం మనిషి అయిపోయింది.
"భారతమాతకు స్వతంత్రం రావాలి.
ఎర్రగా కాలి ఉన్నప్పుడే ఇనుమును సుత్తితో కొట్టాలి.
ఇంగ్లీషు వారు ఇప్పుడు చిక్కుల్లో ఉన్నారు.
ఇప్పుడే మనం స్వరాజ్యం, లేదా
కనీసం కొన్ని హక్కులు గుంజుకోవాలి".
అని, **1916-17** లలో
'హోమ్‌రూలు' ఉద్యమం మొదలు పెట్టింది.
'లోకమాన్య' తిలక్ ఆమెతో చేతులు కలిపారు.

హరిసర్వోత్తమరావు
ఆంధ్ర హోంరూలు లీగ్ శాఖకు కార్యదర్శి అయ్యారు.
ఆ హోదాలో ఆయన దేశం అంతా తిరిగారు.
'మాకు స్వరాజ్యం కావాలి'
అని సంతకాలు చేయించారు.
ఆ కాగితాలన్నీ ఇంగ్లీషు
పార్లమెంటుకు పంపించారు.
బెసెంటు దొరసాని, హరిసర్వోత్తమరావు,
చక్కగా మాట్లాడుతారు.
వీరి ఉపన్యాసాలు విని విద్యార్థులు రెచ్చిపోతున్నారు.
అందుచేత, 'రాజకీయసభలకు విద్యార్థులు పోరాదు'
అని మదరాసు ప్రభుత్వం జి. ఓ. జారీచేసింది.
**1905-07** వందేమాతరం ఉద్యమం,
**1916-17** లలో హోంరూల్ ఉద్యమం,
మనదేశ ప్రజలలో
రాజకీయ చైతన్యాన్ని పెంపొందించాయి.
జాతీయ భావాలు వృద్ధి అయ్యాయి.
ఇంగ్లీషు ప్రభుత్వం ప్రకటించిన
రాజ్యాంగ సంస్కరణలు
బెసెంటు దొరసానికి నచ్చాయి.
కాని, గాంధీజీకి, ప్రజలకు, నచ్చలేదు.

అందుచేత, 1919 ఏప్రిల్ 6న
(హర్తాళ్) బంద్ జరిగింది.
రాజకీయ సభలు విమర్శనలు, జలియన్‌వాలాబాగ్‌లో
పోలీసుకాల్పులు, ప్రభుత్వ నిరంకుశ చర్యలు
నిరసిస్తూ దేశం అంతటా ఉద్యమాలు, నడిచాయి.
ఇవన్నీ ఇకమీద గాంధీజీ ఒక్కడే
ప్రజానాయకుడు అని రుజువు చేసాయి.
1920లో జూలై 31 నాడు నడిరేయిని
లోకమాన్య అవతారం చాలించినాడు.
గాంధీజీ ప్రజలు మెచ్చిన నాయకుడు.
కాని, కాంగ్రెసులో ఇంకా రాజకీయ చతురులు,
ఎందరో ఉన్నారు.
మోతీలాల్ నెహ్రూ, లాలా లజపతిరాయ్,
చిత్తరంజన్‌దాస్, లోకమాన్య తిలక్ అనుచరులు,
బెసెంటుతో పని చేసినవారు.
వారిలో ఒక్కొక్కరు ఒక్కొక్క పులి, సింగము.
వారందరూ గాంధీజీ మార్గాన్ని
పూర్తిగా మెచ్చుకోలేదు.
"మనం స్వరాజ్య పార్టీ ఏర్పాటు చెయ్యాలి.
ఎన్నికలలో పాల్గొని విజయం సాధించాలి.

రాజకీయ పోరాటాలు
రాజసభ (కౌన్సిల్) లలో నడిపించాలి.
బ్రిటిషు పరిపాలనాధికారమే మన శత్రువు.
అది కంటికి కనిపించని పులి వంటిది.
రాజసభల ద్వారా ఆ పులి తన అధికారం
చెలాయిస్తోంది.
అక్కడే దాని కోరలు పట్టి లాగి
మనం జయం పొందాలి.
అదే మన ప్రజల పరిపాలనకు శత్రువు.
అది అక్కడే జిత్తులు పన్ని, ఎన్నో ఎత్తులు వేస్తోంది.
మనం కూడ అక్కడే పై ఎత్తులు వేసి,
దాన్ని చిత్తు చెయ్యాలి."
అని వారు వాదించసాగారు.
గాంధీజీది సత్యాగ్రహ మార్గం.
అందులో "అహింస, అంటరానితనం లేకుండా
చెయ్యడం, ఖద్దరు, స్వదేశీ వస్తువులు వాడటం
విజాతీయ చదువులు, కోర్టులు వద్దనడం, కల్లుసారాయి
మానడం, హిందువులు ముస్లిములు
అందరూ కలిసి మెలసి ఉండటం,
శాంతి సైనికులు పోలీసులు తిట్టినా కొట్టినా

జైలులో వేసి బాధించినా ఓర్చుకొనడం,
అనేవి ఇమిడి ఉన్నాయి.
ఈ మార్గంలో నడవటం కష్టం కావచ్చు.
కాని, తప్పదు. ఇదే మన తత్వానికి తగినదారి.
మనం ఈ దారినే నడచి శత్రువులను
మిత్రులుగా మార్చవచ్చు.
ఒక్కొక్క రాజసభ ఒక్కొక్క సాలెపురుగు గూడు.
అందులోకి వెడితే తిరిగి బైటికిరాలేము.
అందుచేత, అవి మనకు వద్దేవద్దు"
అని, గాంధీజీ వాదించారు.
**1920**లో కలకత్తా కాంగ్రెసు,
గాంధీజీ కార్యక్రమాన్ని అంగీకరించింది.
హరిసర్వోత్తమరావు, ఆ సభలో పాల్గొన్నారు.
ఆయన ఎన్నుకున్న మార్గం లోకమాన్య మార్గం.
"అహింస అంటరానితనం, తొలగించడం, అనేవి
నైతిక, మానవతామార్గాలు.
అయినా, ఖద్దరు ఐకమత్యం, వయోజనవిద్య,
ఆర్థిక, సామాజిక కార్యక్రమాలు.
ఇవి నేనుకాదనను; కొనసాగించాలి, కొనసాగిస్తాను.
కాని, ఇవి స్వరాజ్య సాధనకు తగిన
రాజకీయ విధానాలు అని అనలేను.
అని, ఆయన భావించారు.

దక్షిణ హిందూదేశ సత్యాగ్రహ సంఘానికి
జాయింటు కార్యదర్శి అయ్యారు.
సత్యాగ్రహ ఉద్యమాలు నడిపించసాగారు.
1921లో వేల్సు యువరాజు మనదేశం వచ్చాడు.
"మాకు మీ ఇంగ్లీషు రాజరికం వద్దు."
అని, నిరసన ప్రదర్శనలు జరిపారు.
ఆఏడే బెజవాడలో కాంగ్రెసు సభ జరిగింది.
ఆంధ్రరత్న "రామదండు"
క్రమశిక్షణతో ఆ సభ నడిపించింది.
1923లో కాకినాడలో కాంగ్రెసు సభ జరిగింది.
అప్పుడు కాంగ్రెసు, హిందూస్థాన్ సేవాదళ్
ఏర్పాటు చెయ్యాలనే తీర్మానం చేసింది.
దానికి, వాలంటీర్లను ఎన్నికచేసి శిక్షణ ఇవ్వడంలోనూ
సేవాదళ్ నిర్మాణంలోనూ,
హరి సర్వోత్తమరావు పాల్గొన్నారు.
1917లోనే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు ఏర్పడింది.
'దేశభక్త' కొండా వెంకటప్పయ్య దానికి అధ్యక్షులు.
ఆంధ్రరత్న ఒక కార్యదర్శి.
అయ్యదేవర కాళేశ్వరరావు మరో కార్యదర్శి.
హరిసర్వోత్తమరావు పశ్చిమ
ఆంధ్రసుబా (రాయలసీమ) కు నాయకుడు.

అందుచేత, ఆ జిల్లాలలోని కాం|గెసు పనులన్నీ
రావుగారివి అయ్యాయి.
కర్నూలు ఖద్దరు బోర్డుకు ఆయనే కార్యదర్శి.
ప్రచారకులచే ఖద్దరు అమ్మించేవారు.
తాను కూడా అమ్మేవారు.
సాధారణంగా ఖద్దరు బోర్డులు నష్టంతోనే నడిచేవి.
అది తెలిసి కూడా అధ్యక్షులు వెంకటప్పయ్య
"ఈ నష్టం బాధ్యత మీ బోర్డు మెంబర్లది.
మీ మీద కేసు పెట్టవలసి వస్తుంది".
అని మాట జారారు.
వెంటనే రావుగారు.
"ఏమిటి? ఎవరి మీద, ఎందుకని కేసు పెడతావు?
ఇవిగో లెక్కలు, చూసుకో,
నష్టానికి కారణాలు తెలుసుకో.
మాలో ఎవరూ ఒక్క పైసకూడా తినలేదు".
అని, గర్జన చేశారు.
కచ్చితంగా నిజం చెప్పడానికి
మొగమాటపడే తత్త్వం రావుగారిలో లేదు.
అది రుజువైంది.
అది గాంధీజీకి కూడా తెలుసు.

గాంధీ ఒకసారి ఎ.ఐ.సి.సి కి ఒక తీర్మానం
సూచించారు.
అందులో ఒక లోపం ఉంది.
వెంటనే రావుగారు లేచి నిలబడి
ఆ లోపాన్ని వివరించారు.
"మీరు సూచించిన తీర్మానం మన కాంగ్రెసు
కార్యక్రమానికే వ్యతిరేకం.
అని, గాంధీజీకి గట్టిగా చెప్పారు".
గాంధీజీ సరసుడు.
"ఈ హరి సర్వోత్తమరావు మంచి సాహసి"
అని, మెచ్చుకున్నారు.
వందేమాతరం ఉద్యమం తర్వాత **1947** వరకూ
తెలుగుదేశంలో కొనసాగిన
**1920-24** సత్యాగ్రహం,
**1928** లో సైమన్ రాకకు నిరసన,
**1930-32** ఉప్పు సత్యాగ్రహం,
**1942** ఆగస్టు పోరాటం
పెద్దా చిన్న ఉద్యమాలు అన్నింటికీ రావుగారి
అండ ఉంది.
ఆయనకు 'జైలు అంటే భయం' అని,
ఎవరూ అనలేరు.

అది ఎన్నడో రుజువైన నిజం.
కాని, ఆయన 1920-24లో 1930-32లో
1947 లలో జైలుకి పోలేదు.
దానికి ఆయన రాజకీయ విశ్వాసమే కొంత కారణం.
ఇంటి సమస్యలు కూడా కొంత కారణం కావచ్చు.
"సత్యాగ్రహ ఉద్యమం
నిజంగా రాజకీయ పోరాటం కాదు.
స్వరాజ్య పార్టీ కౌన్సిళ్ళలో జరిపే పోరాటాలే
నిజమైన రాజకీయ పోరాటాలు.
వాటివల్లనే ఫలితం వస్తుంది".
అని, ఆయన నమ్మకం.
కాని, అట్లాగని ఆయన సత్యాగ్రహ ఉద్యమానికి
దూరంగా లేరు.
"ఖద్దరు కట్టండి, తయారుచెయ్యండి.
విదేశీ బట్టలు కట్టవద్దు.
ఉన్నవి వెంటనే తగులబెట్టండి".
"విదేశీ ప్రభుత్వపు కొలువులు చెయ్యకండి.
వెంటనే రాజీనామాలు ఇవ్వండి".
"కల్లు సారా యిజారా పాటలు పాడకండి"
అని పికెటింగు చేశారు.

అంటరానితనం పాటించకండి.
కుల, మత భేదాలు తగవు.
అంతా ఒక జాతిగా రూపొందాలి.
అని, చిత్తశుద్ధితో ప్రచారం చేశారు.
ఆయన తన జీవితకాలంలో
స్వదేశీ, ఖద్దరు, తప్ప మరేదీ కట్టలేదు.
గూడూరు (నెల్లూరు జిల్లా)లో
వల్లటూరి వెంకయ్య నాయుడు మొదలైనవారు
తమ విదేశీ బట్టలన్నీ మంటలో వేశారు.
సంకటి కొండారెడ్డి
తన మునసబుగిరికి రాజీనామా ఇచ్చారు.
నంద్యాలలో కల్లు సారాల యిజారా పాటలు
చాటుగా జరిగాయి.
రావుగారి మెడలో జందెం ఎప్పుడో మాయమైంది.
కాని, ఆయన సమయం దొరికితే
'రామా, రారా!' అని పాడుకోవటం
భార్యను రాముడూ అని ప్రేమతో పిలవడం,
ఆయన మనసులో రామభక్తి ఉందని తెలియజేసేవి.
అంటరాని లింగన్న, క్రైస్తవుడైన బెన్నీ,
ముస్లిము కబీరూ, ఆయన ఇంటిలోని వారయినారు.

ఆంధ్రోద్యమం, సహకార ఉద్యమం, రైతుల
సమస్యలు, కరువుకాటకాల నివారణ చర్యలు,
కలరా నిరోధక చర్యలు, రాయలసీమ సేద్యపు
వనరులు, ఆయుర్వేదానికి ప్రోత్సాహం,
మొదలైన అన్నింటిలోనూ ఆయన
ఇన్నేండ్లూ శ్రద్ధతో పాల్గొన్నారు.
వాటన్నింటినీ వివరంగా తెలుసుకోవాలంటే
ఇక్కడ అవకాశం లేదు.
ఆయన ఆదర్శం "స్వరాజ్య పార్టీ"
ఆ పార్టీ తరఫున ఆయన
మదరాసు కౌన్సిల్‌కి ఎన్నిక అయ్యారు.
కౌన్సిలులో అనేక పోరాటాలు నడిపారు.
విజయాలు సాధించారు.
మూడేండ్లు మెంబరుగా ఉండి,
పార్టీ పిలుపుతో రాజీనామా ఇచ్చారు.
ఇదీ ఆయన కాంగ్రెసులో ఎన్నుకున్న
రాజకీయ సాధన మార్గం.
దీన్ని గురించి మనం కొంత తెలుసుకుందాం.
"అందరికీ చదువు",
"ఊరూరా గ్రంథాలయం"

అన్నవే ఆయన ఉద్యమాలు.
అవే సర్వోత్తమరావు గారికి ఊపిరి.
అందుకోసమే ఆయన కర్మయోగ సాధన.
వాటిని గురించి తెలుసుకొనడమే
మనం అసలు చెయ్యవలసిన పని.
కాని, ముందుగా కౌన్సిలు ద్వారా
రావుగారు చేసిన ప్రజాసేవ
గురించి తెలుసుకుందాం.

# 4. మదరాసు కౌన్సిలు: రావుగారి ప్రజాసేవా రంగం

"మాంటేగు రాజకీయ సంస్కరణలు
మాకు నచ్చలేదు.
వాటితో మాకు ఏమీ పనిలేదు.
కాంగ్రెసు వారు ఎవరూ
ఎన్నికలలో పోటీ చెయ్యటం లేదు; చెయ్యరు.
మీరెవరూ వోట్లు వెయ్యవద్దు,
బ్యాలెటు పెట్టెలు కాళీగా పంపండి". అని,
1919లో కాంగ్రెసు,
'సహాయ నిరాకరణ ఉద్యమం' నడిచింది.
ఎన్నో వోటు పెట్టెలు కాళీగా వెళ్ళాయి.
అయినా కాంగ్రెసేతరుల
సహకారంతో పరిపాలన నడిచింది.
1927 వరకూ అట్లాగే సాగింది.
కాంగ్రెసు, స్వరాజ్య పార్టీని ఏర్పరిచింది.
ఈ ఎన్నికల్లో మనం కాంగ్రెసు బలం చూపిద్దాం.

'కర్నూలు జిల్లాకు
నాయకంటి శంకరరెడ్డి నిలబడాలి'. అని,
ప్రకాశంగారు అన్నారు.
శంకరరెడ్డి,
పత్తికొండ, కర్నూలు తాలూకాలు తిరిగారు.
అక్కడి పెద్దలను కలిశారు.
వారందరూ ఒకేమాటగా
'మాకు హరి సర్వోత్తమరావు కావాలి' అన్నారు.
'ఈ హరి సర్వోత్తమరావు ప్రజల మనిషి'.
మనం ఆయననే నిలబెట్టాలి.
లేకపోతే వోట్లు చీలిపోతాయి.
అని, పార్టీ గుర్తించింది.
కాంగ్రెసు పార్టీకీ, జస్టిస్ పార్టీకీ, పోటీ పడింది.
జస్టిస్ పార్టీ శరభారెడ్డిని నిలబెట్టింది.
ఆ శరభారెడ్డి, రావుగారి చిన్ననాటి మిత్రుడు.
ప్రజాసేవలో ఇద్దరిదీ ఒకేమాట.
కాని, వారి పార్టీలు వేరయ్యాయి.
అయినా, శరభారెడ్డి తన ప్రచారంలో
"రావుగారు విద్యావేత్త; గుణవంతుడు;
త్యాగశీలి; సేవానిరతుడు; నాకు మిత్రుడు.

కాని, కాంగ్రెసు పార్టీ వాడు".
అందుచేత, 'ఆయనకు మీరు వోట్లు ఇవ్వకండి'
అని చెప్పేవారు.
ఈ ప్రచారం వల్ల రావుగారికే లాభం కలిగింది.
రావుగారికి, పార్టీ
75 రూపాయలు మాత్రమే ఇచ్చింది.
"నీ ఎన్నికల ఖర్చు నీదే.
పార్టీ మరేమీ ఇయ్యదు.
ప్రజల నుంచి వసూలు చేసుకో"
అని, తప్పించుకుంది.
రావుగారు, రాయలసీమ అంతా తిరిగారు.
తన పార్టీలోని అందరి తరఫునా ప్రచారం చేశారు.
వోటర్లనుంచే ఎన్నికల నిధిని కూడా సేకరించారు.
మొత్తం మీద విజయం సాధించారు.
కౌన్సిలులో జరిగిన చర్చల్లో,
అక్కడ పార్టీ సాధించిన పనుల్లో,
మొత్తం రావుగారి వాటాయే చాలా ఎక్కువ.
వారు, 21 నెలల తర్వాత
ఒక నివేదిక తయారు చేశారు.

అది చూస్తే—
ఆంధ్ర విశ్వవిద్యాలయం ఏర్పాటు
అడవుల పరిపాలనలో సంస్కరణలు,
కార్మికుల బతుకులు మెరుగుపరిచే శాసనాలు.
రాయలసీమలో కొత్త సేద్యపు వనరులు,
అణచబడిన జాతులకు భూముల కేటాయింపు,
శ్రీశైలానికి రోడ్డు,
అహోబిలానికి రక్షిత నీటి వసతి,
గురించి చర్చలూ, పనులూ జరిగాయి.
మొత్తం, సమావేశాలు జరిగిన 59 రోజుల్లో
రావుగారు 371 చర్చలలో పాల్గొన్నారు.
5 చిత్తు బిల్లులు రూపొందించారు.
47 అంశాల మీద జరిగిన
బడ్జెటు చర్చల్లో పాల్గొన్నారు.
19 అంశాలలో ప్రజల మేలు సాధించి,
అందరు మెంబర్లతో కలిసిమెలిసి పనులు చేశారు.
కౌన్సిలులో జరిగిన పనిని వివరంగా వ్యాసాల
రూపంలోరాసి, పత్రికల ద్వారా ప్రజలకు తెలిపారు.
ఇదీ 'ప్రజల ప్రతినిధి' బాధ్యత.
అని, ఆయన నమ్మి నడచుకొన్న విధానము.

ఆ రోజుల్లో కౌన్సిలు మెంబర్లకు జీతాలు లేవు.
మీటింగులకు హాజరు అయిన రోజులలో మాత్రం
వారికి రోజుకి ఏడు రూపాయలు ఇచ్చేవారు.
అదనంగా, రాకపోకలకు రైలు ఖర్చులు ఇచ్చేవారు.
ఈ కౌన్సిలు మెంబరుగిరీ పదవి కాదు.
ప్రజాసేవకు ఒక అవకాశం.
పరిపాలనలో లోట్లు విమర్శించవచ్చు.
ప్రజల నిరసన తెలియజేయవచ్చు.
నిరంకుశ పరిపాలన అనే పులి కోరలను
ఒక్కొక్కటిగా పీకి పారవెయ్యవచ్చు.
అదే కాంగ్రెసు స్వరాజ్య పార్టీ ఆశయం.
దాన్నే హరిసర్వోత్తమరావు కొంతవరకు సాధించారు.
ఒకవంక కౌన్సిళ్ళలో ఇట్లా ఉండగా,
మరొక వంక దేశంలో,
రాజకీయాల్లో త్వరగా మార్పులు వచ్చాయి.
"1919 రాజకీయ సంస్కరణలు
భారతీయులకు నచ్చలేదు.
మనం కొత్త ఆలోచనలు చెయ్యాలి".
అని, పరిపాలకులు సైమను కమిషను వేశారు.
"మీరు భారతీయులతో కలిసి చర్చలు చెయ్యండి.

వారికి, వారి దేశ పరిపాలనలో
ఎంత వాటా ఇవ్వవచ్చు ?
ఆ విషయం గురించి ఒక నివేదిక ఇయ్యండి"
అని, కమీషనుకు చెప్పారు.
"ఈ కమీషనులో ఉన్న మెంబర్లు
అందరూ తెల్ల దొరలే"
భారతీయుడు ఒక్కడైనా లేడు
ఈ కమిటీతో మనకు పనిలేదు.
ఇది కాలయాపనకు వేసిన ఎత్తు.
ఈ కమీషను మెంబర్లు వస్తే —
'సైమన్ ! పో, వెనక్కి పో !'
అంటూ, నల్లజెండాలు చూపించండి."
అని, కాంగ్రెసు తీర్మానం చేసింది.
నల్లజెండాలతో ఊరేగింపులు,
పో ! వెనక్కి పో ! అనే నినాదాలు.
ప్రతి నగరంలోనూ సైమన్ కమిషనుకు
ఎదురు అయ్యాయి.
ఆ ఊరేగింపులపై పోలీసులు కాల్పులు జరిపారు.
ఎందరో ప్రజలు, ప్రాణాలు కోల్పోయారు.
సైమను కమిషను, తన నివేదిక యిచ్చింది.

పరిపాలకులు, లండనులో,
గుండ్రబల్ల సమావేశం ఏర్పాటు చేశారు.
ఆ మీటింగులో భారతదేశ
పరిపాలన గురించి చర్చలు జరుగుతాయి.
'రండి' అని, పరిపాలకులు కొందరిని పిలిచారు.
"ఇదంతా కాలయాపన"
హిందువులు, ముస్లిములు, కులాలు,
జాతులు అంటూ, ఇంగ్లీషు వారు
మన జాతిని చీల్చేటందుకే ఈ మీటింగు.
ఈ సమావేశంలో ఏమీ ముందడుగు పడదు.
మేము రాము."
అని, కాంగ్రెసు తీర్మానం చేసింది.
'గాంధీజీని' పూర్తి అధికారం చేపట్టండి.
దేశాన్ని నడిపించండి అని, కోరింది.
జనవరి 25, 1929.
గాంధీజీ మన పరిపాలకులకు
తుది నోటీసు పంపాడు. అందులో—
"మీరు మా దేశాన్ని పాలించడం తగదు.
మీ సామ్రాజ్యంలో కెనడా దేశం ఒకటి.
అక్కడ పరిపాలన ప్రజలదే,

అయినా మీ మాటకు కొంత విలువ ఉంది.
అట్లాంటి పరిపాలనే మా దేశానికి కావాలి.
దాన్ని మీరు ఒక ఏడాదిలో ఏర్పాటు చెయ్యండి.
లేదా ఏర్పాటు చేస్తామని
ప్రకటన అయినా చెయ్యండి.
అది మీ చిత్తశుద్ధికి గీటురాయి,
ఆ గడువు దాటితే మీకూ మాకూ కుదరదు.
పూర్తి స్వతంత్రమూ,
అది సాధించుకొనడమూ,
మా ఆశయాలుగా మారుతాయి.
మాకు నచ్చిన దారిని మేము నడుస్తాము"
అని, కచ్చితంగా తెలియజేశారు.
జనవరి **26, 1930** వచ్చింది.
"ఇంగ్లీషు పరిపాలకులు
మనకు ఏమీ జవాబు ఇవ్వలేదు.
ఈనాడు అన్ని నగరాలలో,
పట్నాలలో, పల్లెలలో
కాంగ్రెసు జెండాతో ఊరేగింపులు జరపండి.
నినాదాలేమీ చెయ్యకండి.
ఊరి నడిబొడ్డున జెండా వందనం చెయ్యండి.

"ఈ నిమిషం నుంచీ
పూర్తి స్వతంత్రమే మా ఆశయం.
అది మేము సాధించుకుంటాము.
శాంతి, అహింస, సత్యాగ్రహం, మా మార్గాలు
ఇదే మా తీర్మానం."
అని, ఎవరి దారిన వారు ఇంటికి పొండి.
అని, గాంధీజీ ఆదేశం ఇచ్చారు.
మన తర్వాత కార్యక్రమం "ఉప్పు సత్యాగ్రహం"
అదే మన పోరాటానికి మొదలు
శాసన సభలలో, ఇతర సంస్థలలో
ఉన్న మన ప్రజా ప్రతినిధులు అందరూ
మార్చి 30 లోపున రాజీనామాలు ఇయ్యండి.
అని, మార్చి 2 న గాంధీజీ
ఒక ప్రకటన చేశారు. పిలుపు ఇచ్చారు.
హరి సర్వోత్తమరావు ఆలోచన చేశారు.
"స్వతంత్ర పోరాటం
అన్ని రంగాల్లోనూ కొనసాగాలి.
వాటిలో శాసన సభలు ఒక రంగం.
అక్కడి నుంచి సైనికులను బైటికి రమ్మనడం...
మంచి పని అనవచ్చా ?

మరికొంత వివరంగా ఆలోచన చెయ్యాలి.
అని ఆయన అనుకున్నారు.
అయినా ఆయన గవర్నరుకి
తన రాజీనామా పంపారు.
"ఈ రాజీనామా
మార్చి 17 నుండి అమలులోకి వస్తుంది"
అని, అంచులో అదనంగా చేర్చారు.
"ఇది రాజీనామా ఉత్తరం కాదు, చెల్లదు."
అని, గవర్నరు దాన్ని తోసిపారేశాడు.
"రావు గారు రాజీనామా చెయ్యలేదు.
ఇది క్రమశిక్షణ లోపం.
ఆయన మీద చర్య తీసుకోవాలి."
అంటూ అసూయతో కొందరు నెహ్రూజీకి రాశారు.
నెహ్రూ అప్పుడు, కాంగ్రెసు ప్రెసిడెంటు,
ఆయన వెంటనే రావుగారికి జాబు రాశాడు.
రావుగారు తన ఆలోచనలు వివరంగా రాశారు.
"రావుగారూ ! మీ జాబు అందింది.
ఈ స్వతంత్ర పోరాటంలో
మనం ఒకరినొకరము అర్థం చేసుకోవాలి.
ఇందులో అందరమూ పాల్గొనాలి"

అని, నెహ్రూ రాశారు.
ఏప్రిల్ నెలలో
సత్యాగ్రహ పోరాటం ముమ్మరమైంది.
మే నెల వచ్చింది.
ప్రభుత్వం గాంధీజీని అరెస్టు చేసింది.
నాయకుల అరెస్టులు, లాఠీ చార్జీలు,
పోలీసు కాల్పులు, జోరుగా సాగుతున్నాయి.
"ఇది రాజనీతి కాదు, దమన నీతి."
అని, రావుగారు నిరసించి, రాజీనామా ఇచ్చారు.
కౌన్సిల్‌లో మూడేండ్లు సాగిన
స్వతంత్ర పోరాట ఘట్టం పూర్తి అయింది.
**1933** లో, గాంధీజీ పోరాటం ఆపివేశారు.
ఆ తర్వాత, కాంగ్రెసు నుంచి తప్పుకున్నారు.
నిర్మాణ కార్యక్రమాన్ని,
హరిజన సమస్యనూ చేపట్టారు.
తర్వాత, **1934** లో కేంద్ర శాసనసభకూ,
**1937** లో రాష్ట్ర శాసన సభలకూ
ఎన్నికలు జరిగాయి.
వాటిలో కాంగ్రెసు పాల్గొనడం జరిగింది.
కాని, రావుగారికి వాటిలో సీటు దొరకలేదు.

అయినా ఆయన ఏమీ మారలేదు.
"కాంగ్రెసు విజయం పొందాలి".
అని, పూర్వం రీతిగానే ప్రచారం చేశారు.
వీటిని మనం ఈనాడు పరిశీలిస్తే—
"ఈ హరి సర్వోత్తమరావు 'తిక్కడు'
అందుచేత ఈయనకు ఏ పదవీ ఇవ్వకూడదు.
కాని, ఆయనకు ఎప్పుడూ పని ఉండాలి.
లేకపోతే కల్పించుకుంటాడు.
అది మనకు ముప్పు తేవచ్చు.
అందుచేత, మనం ఈయనకు
వరసగా పనులే అప్పగిద్దాము.
అని, కాంగ్రెసు పెద్దలు అనుకొన్నారేమో!"
అనే ఆలోచనలు వస్తాయి.
ఆ కాంగ్రెసు పెద్దలు, రావుగారికి
రాజకీయ పదవులు రాకుండా అడ్డుపడ్డారు.
అందువల్ల ఆయన పూర్తిగా
'గ్రంథాలయోద్యమంలో
వయోజన విద్యా ఉద్యమంలో'
మునిగితేలి "తెలుగుజాతి మరువరాని మనిషిగా
మారేటందుకు కారకులయారు.

అదే ఒక రకంగా మన భాగ్యము.
ఇప్పుడు మనం ఆ ఉద్యమాల
వివరాలు తెలుసుకోవలసి ఉంది.
అదీ, ఆయన కాంగ్రెసు వాదిగా ఎన్నుకున్న
సాధన మార్గం.
దీన్ని గురించి మనం తెలుసుకున్నాం.
"అందరికీ చదువు"
"ఊరూరా గ్రంథాలయం"
అన్నవే ఆయన ఉద్యమాలు.
అవే సర్వోత్తమరావు గారికి ఊపిరి.
అందుకోసమే ఆయన కర్మయోగ సాధన.
వాటిని గురించి, తెలుసుకొనడమే
అదే అసలు మనం చెయ్యవలసిన పని.
అదే ఇప్పుడు మనం చెయ్యవలసి ఉంది.

# 5. యువతరానికి చేసిందీ, మిగిల్చిందీ

హరి సర్వోత్తమరావు విప్లవకర జాతీయవాది.
విజ్ఞాన చంద్రిక ప్రచురణలు,
విజ్ఞాన సర్వస్వాల తయారీలో ఆయన వాటా,
కౌన్సిలు మెంబరుగా ప్రజాసేవ కోసం
ఆయన జరిపిన పోరాటాలు,
పేదల ఆర్థిక, సామాజిక అభివృద్ధి కోసం
సాగించిన నిర్మాణ కార్యక్రమాలు,
అన్నీ ఈ అంశాన్నే రుజువు చేస్తాయి.
ఆయన పేదరికంలో
ఏటికి ఎదురు ఈదుతూ 76 ఏండ్ల
జీవితాన్ని గడిపారు.
వయసులో ఉన్నా, వయసు మీరినా,
ముసలి తనం మీదపడినా,
కార్యక్రమాలు నడిపించడంలో
ఆయన యువకులలో యువకుడు.
"శరీరంలో శక్తి లేకపోయినా

సేవ చేస్తూ చేస్తూ రాలిపోవాలి.
ఇదే నాకోరిక, తెలిసిందా?"
అని, ఒక సందర్భంలో గర్జించాడు.
అందుచేత, ఆయన యువతరానికి ఏమి చేశాడు?
వారిని ఏమి చెయ్యమన్నాడు?
అని మనం తెలుసుకోవాలి.
ఫలితాలు ఇచ్చే కార్యక్రమాలు చేపట్టాలి.
అదే ఆయనకు మన నివాళి.
హరి సర్వోత్తమరావు విద్యావేత్త.
'విద్య మూడో కన్ను.
అది కలిగినవాడే అన్నీ తెలుసుకోగలడు'
అని నమ్మినవాడు.
మనదేశంలో చదువులు వచ్చినవారు చాలా తక్కువ.
అందుచేత, చదువులేని వారందరూ
రాత్రి పాఠశాలల్లో,
వేసంగి పాఠశాలల్లో,
విద్యావంతులు కావాలి.
నాయకులలో అనేక తరహాలవారు ఉండవచ్చు.
కాని, ప్రజలలో, ప్రజా సంఘాల చర్చల్లో,
ఆ లోపాలన్నీ ఎగిరిపోతాయి.

నికరమైన నిర్ణయాలే మిగులుతాయి.
అందుకే ప్రజాస్వామ్యం,
దాని రక్షణ కోసమే యువతరానికి జాతీయ విద్య.
ఆ విద్యా సంస్థలకే నా పూర్తి సహకారం.
అనే పట్టుదలతో ఆయన పని చేశారు.
ఇట్లాగే ఆలోచన చేసి, కృషి చేసిన వారిలో
'రామానీడు* విద్యాలయ' కులపతి
ఆచార్య రంగా,
తాడేపల్లిగూడెం తాలూకాలో
**1929**లోనే కార్యక్రమాలు నడిపిన
శనివారపు సుబ్బారావూ గుర్తు వస్తారు.
**1934** నుంచి చివరి వరకూ,
హరి సర్వోత్తమరావు, తన కాలాన్ని పూర్తిగా
వయోజన విద్య, గ్రంథాలయ ఉద్యమాల
కోసమే వినియోగించారు.
మిగిలినవన్నీ వాటి తరవాతనే.
కాల్వబుగ్గలో వేసంగి కళాశాల నడిపారు.
అప్పుడు కాంగ్రెస్ సోషలిస్టు పార్టీతో
చేతులు కలిపి పనిచేశారు.
**64** మంది యువకులకు శిక్షణ ఇచ్చారు.

---

* నిడుబ్రోలు, గుంటూరు జిల్లా

అప్పటి విద్యాబోధనలో యువకులు—
భారత రాజకీయ ఉద్యమం
రాయలసీమ చరిత్ర, పరిశ్రమలు, ప్రాజెక్టులు
కరువు నివారణ మార్గాలు
రైతుల సమస్యలు, జమీందారీ రిపోర్టు, ప్రకాశం బిల్లు
స్వయం నిర్ణయ సూత్రం
గాంధీ తత్వం
మార్క్సిజం
అభివృద్ధి కోసం ప్లానింగు
గ్రామ పునర్నిర్మాణ కృషి
గ్రంథాలయాలు
మొదలైన విషయాలు ఎన్నో చర్చించడము,
చేపట్టతగిన కార్యక్రమాలు తీర్చిదిద్దడము
జరిగింది.

ఇది కేవలం ఒక ఉదాహరణ మాత్రమే.
ఆ రోజుల్లో వేసంగి రాజకీయ పాఠశాలలు
దేశమంతటా నడిచాయి.

అన్నింటిలోనూ హరి సర్వోత్తమరావు,
పులగంలో పప్పు.
అన్నింటి మీదా పోలీసుల కన్ను ఉండేది.
కొన్ని, నిషేధాలకు లాఠీ ఛార్జీలకు గురి అయాయి.
గ్రంథాలయోద్యమం, వేసంగి పాఠశాలలు,
ఆంధ్రోద్యమం, ఎన్నికల ప్రచారం,
హరి సర్వోత్తమరావును పల్లె పల్లెకూ
తోడ్కొని పోయాయి.
ఈ కార్యక్రమాలలో వచ్చే రాబడి ఏమీ లేదు.
హిందూ పత్రికలో పుస్తకాలపై విమర్శలు రాయడం
ఆయనకు ఇరవై ఏండ్ల పాటు ఆధారం అయింది.
ఆ తరవాత రోజుల్లో రేడియో ప్రసంగాలు.
వరసగా రాసిన అనేక వ్యాసాలకు
పత్రికల వారు ఇచ్చిందీ,
రాసిన పుస్తకాలకు
ప్రకటనకర్తలు ఇచ్చిందీ,
కొంత ఆధారం.
ఇల్లు గడపడం, అతిథుల మర్యాదలు చూడటం,
**1942** వరకు, భార్య రామాబాయి చూసుకునేది.

ఆ తర్వాత కూతురు ద్వారక,
అల్లుడు పార్థసారథి చూసుకున్నారు.
అందుచేత, రావుగారు,
"వందే మాతరం" అని, తిరగ గలిగారు.
**1939** నుంచి రావుగారికి మరొక
కార్యక్రమం దొరికింది.
ఆకాశంలో కొత్తచుక్క పొడిచింది.
'వయోజనుల అక్షరాస్యత ఉద్యమం'
అనేదే ఆ కొత్త చుక్క.
**1907** నుంచి నాటి వరకూ
రావుగారు కోరుకుంటూ వున్నది.
ప్రజల విద్య అనేదే ఆ ధ్రువతార
వయోజనులకు రాజకీయ చైతన్యం కలిగించడం,
అందులో ముఖ్యం.
అక్షరాస్యత ఇవ్వాలని కాని, పొందాలని కాని,
ఏ కొందరో అనుకొనేవారు.
ఆ పని ఎప్పుడూ నడిమధ్యలోనే ఆగిపోయేది.
అందుచేతనే అక్షరాస్యత,
పెద్ద ఉద్యమంగా రూపొంద లేదు.
అక్షరాస్యతా ఉద్యమం, **1939** జనవరిలో

మదరాసులో జరిగిన వయోజన విద్యా సదస్సులో
రూపుదిద్దుకుంది.
ఆ సదస్సులో ఎందరో పెద్దలు పాల్గొన్నారు.
వారిలో రావుగారిదే కీలకమైన పాత్ర.
ఆ సభకు డాక్టర్ ఫ్రాంక్ సి. లాబాక్ వచ్చారు.
ఆయన వయోజన విద్యలో నిపుణుడు.
'త్వరగా అక్షరాస్యత పొందడం ఎట్లాగ ?
త్వరగా అక్షరాస్యత ఇవ్వడం ఎట్లాగ ?'
అని, ఆయన ఎన్నో పరిశీలనలు చేశాడు.
ఆ సభలో ఆయన తన అనుభవాలు చెప్పాడు.
తాను వాడిన పద్ధతి చెప్పాడు.
ఆయన చెప్పిన మాటలు : *
"చిన్న పిల్లలు పది నెలల్లో నేర్చిన చదువును
వయోజనులు ఒక నెలలోనే నేర్చుకోగలరు.
అందుచేత, వయోజన విద్యలో
మంచి ఫలితాలు వస్తాయి.
అయితే, మనం అందుకోసం
శాస్త్రీయ పద్ధతిని చేపట్టాలి.

---

* ఇవి యథాతథం కాదు. ఇందులో నా భావాలు, ఆలోచనలు కూడా చేరాయి. —రచయిత

అదేమిటో మనం ఇప్పుడు చర్చించి తెల్సుకుందాం.
"ప్రతి ఒక్కరి మనసులోనూ
ఎన్నో విషయాలు ఉంటాయి.
వారు వాటిని ఇతరులకు తెలియజేస్తారు.
అందుకోసమే
మాటలు, వాక్యాలు వాడతారు, రాస్తారు".
ఇది మనం అందరమూ చేస్తున్న పనే,
ఇప్పుడు మీరు ఏ భారతీయ భాషలో అయినాసరే
మీరు చెప్పదలచిన విషయం కాగితంమీద రాయండి
అందులో ఉన్న వాక్యాలలో, మాటలలో,
హొల్లులు (హల్లులు), గుణింతాలు, అచ్చులు,
ఒత్తులు ఉంటాయి కదా !
వాటిలో ఏవి ఎన్ని ఉన్నాయో లెక్కలు చూడండి.
నేను ఎన్నోసార్లు అట్లా చేశాను.
ఇతరుల చేత చేయించాను.
మనం హొల్లుల్ని గుణింతాలతో కలిపి ఎక్కువగా
వాడుక చేస్తున్నాము.
అచ్చులు, ఒత్తులు, వాటికంటె చాలా తక్కువగా
వాడుక చేస్తున్నాము
ఎన్నిసార్లు విషయం మార్చిరాసినా
ఇట్లాగే లెక్క తేలింది.

అందుచేత, మనం గుణింతాలతో కలిసిన పొల్లులు
ముందు నేర్చుకుందాము.
ఆ తర్వాత వాటితోపాటు అచ్చులూ ఒత్తులూ
నేర్చుకుందాం.
ఇదే సదుపాయంగా ఉండే శాస్త్రీయ పద్ధతి.
వయోజనులకు, రోజుకి రెండో మూడో
హల్లు (పొల్లు) అక్షరాలూ
రెండో, ఒకటో గుణింతపు గుర్తులూ
మాత్రమే నేర్పాలి.
ఆ చదువు వారికి బరువు అనిపించదు.
ఏరోజు నేర్పినవి ఆ రోజే వాడుకచేసి,
మాటలు రాయించాలి.
అదే మనం వారిచేత చేయించే సాధకం.
'దిద్దు, దిద్దు', అని తరిమి తరిమి దిద్దించడం
ఆర్డరు వెయ్యడమే అవుతుంది.
ఒకరి ఆర్డరు మరొకరికి చిరాకు.
అందుచేత 'ఇది చూసిరాద్దాము'. అని చెప్పడమూ
'రాశారా' అని అడగడమూ మంచి పద్ధతి.
సమానతా భావానికి గుర్తు.
మొదటి రోజున నేర్చిన వాటితో మూడు మాటలు
రాయవచ్చు.

వాటిని రెండో రోజున నేర్చిన వాటితో కలిపి,
పది మాటలు రాయవచ్చు.
అప్పుడు, చదువు వస్తుందనే
నమ్మకమూ, ఆశ, కలుగుతాయి.
ఇట్లా మొత్తం 40, లేదా
ఏభై రోజులు కార్యక్రమాన్ని సాగిస్తే—
అన్ని అక్షరాలూ, గుణింతాలూ, ఒత్తులూ వస్తాయి.
రాయగలిగిన మాటలూ వాక్యాలూ
క్రమంగా రోజు రోజుకీ పెరుగుతాయి.
చదువు ఉషారుగా కూడా సాగుతుంది.
ఈ తీరుగా నేను కొందరు వయోజనులకు
తమిళం నేర్పించాను.
మరికొందరు, తెలుగు నేర్చుకున్నారు.
మొత్తం నలభై భాషలలో
ఈ పద్ధతి వాడుక అవుతోంది.
లభించిన ఫలితాలు బాగానే ఉన్నాయి.
భారతదేశంలో చదువురాని వారి శాతం 85* ఉంది

---

* ఈనాడు అది 85 కాదు 70 శాతం. కాని, దేశంలో జనాభా చదువురాని వారి నంబరు బాగా పెరిగింది.

అందుచేత చదివిన ప్రతి ఒక్కరూ కనీసం
మరొకరికి చదువు చెప్పాలి.
ఆ చదువు గట్టిపడే వరకూ వారిని వదలకూడదు.
వారిచేత రోజూ కొంత చదివించాలి, రాయించాలి.
ఇది పూర్తిగా సేవాభావంతో జరగవలసిన పని.
భారతదేశంలోని యువకులలో సమాజ
సేవాభావానికి కొరత లేదు.
అందుచేత, భారతీయులందరూ అక్షరాస్యులు అవాలి
ఇదీ ఈ సదస్సు ఆశయం.
"భారతదేశం అక్షరాస్య దేశం అవాలి"
అనేదే మనం ఇచ్చే నినాదం.
మీరేమంటారు?"
అని, ముగించారు.
సభవారు 'లాబాక్ పద్ధతి'ని చర్చించారు.
హరి సర్వోత్తమరావు 'ఇది చక్కని పద్ధతి,
దీనికి మనం చేర్పులు, మార్పులు చేసి
వాడుకోవచ్చు' అని, అన్నారు.
వెంటనే దక్షిణ హిందూదేశ వయోజన విద్యా
సంఘం ఏర్పాటైంది.
పని మొదలు పెట్టింది.

కాని, 1939లో రెండో ప్రపంచయుద్ధం మొదలైంది.
అది 1945 వరకూ సాగింది.
కాంగ్రెసు మంత్రివర్గాల రాజీనామాలు,
రాయబారాలు, రాజీ చర్చలు.
1942 లో ఆగష్టు పోరాటం.
బ్రిటీషు వారి నిరంకుశ పరిపాలన,
మొదలైనవి దేశాన్ని
రాజకీయ అలజడులలో ముంచాయి.
వాటితో ఎవరికీ ఊపిరి తిరగలేదు.
'వయోజన అక్షరాస్యత ఉద్యమం',
వీటి అన్నింటినీ ఎదిరించి
ముందడుగు వేయలేకపోయింది.
అయినా, 1942లో హరి సర్వోత్తమరావు,
మూడు వయోజన విద్యా వాచకాలు రాశారు.
ఒక చార్టు తయారు చేశారు.
మొదటి వాచకం 40 పేజీల పుస్తకం.
అందులో 33 పాఠాలు.
తెలుగులో అక్షరాస్యత ఇవ్వడానికి ఇవి చాలు.
రెండో వాచకం 36 పేజీలు.
అందులో 19 చిన్న చిన్న పాఠాలు.

ఇవి చదివిస్తే కొత్త చదువు గట్టిపడుతుంది.
మూడో వాచకం 40 పేజీలు.
అందులో 14 పాఠాలు ఉన్నాయి.
అవి అన్నీ ఒకరే రాయలేదు.
తొమ్మండుగురు రచయితలు రాశారు.
వారందరూ పేరు పొందిన రచయితలే.
ఈ మూడూ వరసగా చదివిస్తే
ఈనాడు చదవడం, రాయడం, ఏమీ రానివారు,
ఏభై రోజులలో మారిపోయి,
మనకుతోడి చదువరులు అవుతారు.
తోడి రచయితలు కూడా అవుతారు.
వారికి బోధించే విధానం,
"వయోజన విద్యా బోధనక్రమం" లో
వివరంగా ఉంది.
అది నాలుగో పుస్తకం.*
నాలుగేండ్లు, రావుగారు ఈ అంశాలు
ప్రచారం చేశారు.
సురవరం ప్రతాపరెడ్డి,
కోదాటి నారాయణరావు,

---

* ఈ నాలుగు పుస్తకాలూ ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు ప్రకటించింది.

పాతూరి నాగభూషణం,
కల్లూరి సుబ్బారావు,
వావిలాల గోపాలకృష్ణయ్య,
మాదల వీరభద్రరావు,
లావు బాలగంగాధరరావు,
తాతినేని సూర్యప్రకాశరావు,
మొదలైన పెద్దలూ, యువకులూ,
ఈ సందేశాన్ని అందుకున్నారు.
తమ తమ కార్యరంగాల్లో అమలు చేశారు.
**1946** లో, మరోసారి,
రాజకీయ వాతావరణం మారింది.
ఎన్నికలు జరిగాయి.
ప్రజా ప్రతినిధులకు అధికారం వచ్చింది.
మన ప్రజల్లో వయోజన అక్షరాస్యత,
సామాజిక విద్య పెరగాలి.
అందుకోసం యువకులను సమీకరించాలి.
అనే ఆలోచనలు జరిగాయి.
నాటి విద్యామంత్రి అవినాశలింగం చెట్టియార్.
దక్షిణ భారత వయోజన విద్యా సంఘంతో
ఆలోచించి, ఆయన ఒక పథకం తయారు చేశారు.

అందులో అతి పరిమితమైన బడ్జెటుతో
అపరిమితమైన యువజన ఉత్సాహాన్ని
ఎక్కువ అనుభవం ఉన్న
రావుగారి నేర్పునూ జత చేశారు.
రావుగారు వయోజన విద్యా కార్యక్రమానికి
గౌరవ డైరెక్టరు.
వయోజన అక్షరాస్యతా ఉద్యమ రథసారథి,
యువకులందరూ వీరార్జునులు.
ఆయుధాలు ఇంతకు ముందు పేర్కొన్న—
నాలుగు పుస్తకాలూ, ఛార్టూ.
వాటికి తోడు, వారు రాయించిన
మరో పది చిన్న పుస్తకాలు.
రావుగారు దేశమంతా చుట్టి చుట్టి తిరిగారు.
ఎందరో ఉపాధ్యాయులకు, కాలేజీలలోని,
అధ్యాపకులకు, శిక్షణ ఇచ్చారు.
యువకులకు* శిక్షణ ఇచ్చారు, ఇప్పించారు.

---

* అట్లా శిక్షణ పొందినవారిలోని వారే నల్రావుల వెంకట సుబ్బారావు, జనమంచి వెంకట కామేశ్వరరావు, కారెంపూడి నాగేంద్రుడు, జి. వి. కృష్ణమూర్తి, హరి ఆదిశేషువు, కొండపల్లి రామానుజరావు, యండమూరి వెంకటరమణ, ముత్తు అయ్యర్, బి. పంకజం, డా. వేదుల జగన్నాథం, డి.ఎ. నరసింగరావు మొదలైనవారు.

కొంతపని జరిగింది.
కాని, ఇంకా ఎంతో పని మిగిలింది.
ఇప్పటికీ అట్లాగే మిగిలిపోయి ఉంది.
"రావుగారి షష్టిపూర్తి జరపాలి.
విజయవాడలో 'సర్వోత్తమ భవనం' కట్టాలి.
అక్కడ కులపతిగా వారికి వసతి,
ఏర్పాటు చెయ్యాలి.
అని, పాతూరి నాగభూషణం ఆలోచనలు చేశారు.
"మీకు, నా పేరు మీద, ప్రజల కోసం
పని చెయ్యాలని ఉంది.
అందుచేత, నేను మీమాట కాదనటం లేదు".
అని, రావుగారు ఆయనతో అన్నారు.
1946లో రావుగారి షష్టిపూర్తి ఉత్సవాలు
తెలుగుదేశం అంతటా జరిగాయి.
1949 లో విజయవాడలో 'సర్వోత్తమ భవనం'
ఏర్పాటైంది.
దానిపైన 1957లో 'బాపూజీ మందిరం వెలిసింది.
ఆ మందిర ప్రవేశ ఉత్సవంలో
రావుగారు పాల్గొన్నారు.
అప్పటికే వారి ఆరోగ్యం బీటలు పడింది.

అయినా, మనోబలం వెల్లడిస్తూ,
నాగభూషణంగారితో ఇట్లా అన్నారు.
"నేను కలలు గన్న ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది.
ప్రజల ప్రతినిధులు పరిపాలన చేస్తున్నారు.
అయినా, మన దేశంలో
'చదువురానితనం' ఏమీ తగ్గలేదు.
పైగా అది మరింత పెరిగింది; పెరిగిపోతోంది.
అదే నాకున్న చింత.
ఈనాటి రాజకీయాలు, పదవుల రాజకీయాలు.
అక్షరాస్యత ఉద్యమం ఏదో మెలికలో పడింది.
ఆ చిక్కుముడి వదిలించాలి.
వయోజన విద్యా ఉద్యమాన్ని
పెద్ద ఎత్తున సాగించాలి.
అది యువతరం బాధ్యత.
దాన్ని వారు చేపట్టకపోతే–
ఎన్ని ఏండ్లు గడచినా ప్రజలకు
బానిస బతుకులు తప్పవు
ఉద్యమం విషయం తెల్సుకునేటందుకు

ముందుగా మనం జిల్లాలలో సంచారం చెయ్యాలి.
యువతరంతో చర్చలు చెయ్యాలి.
కార్యక్రమం తీర్చిదిద్దాలి.
ఒక్కొక్క జిల్లాలో
14 కేంద్రాలు, ఏర్పాటు చెయ్యాలి.
వాటి ద్వారా యువకులే ఉద్యమం సాగిస్తారు.
ప్రజలలో ఉన్న అలసతా, అజ్ఞానమూ
డుల్లకొట్టడానికే ఈ ఉద్యమం,
ప్రజల సమర్థత పెంచడానికే ఈ ఉద్యమం.
ఇది ఉవ్వెత్తుగా సాగాలి.
అప్పుడు భావ విప్లవం, క్రియాశీలత,
వాటంతట అవే వస్తాయి.
సమాజం, సోషలిస్టు మజిలిని చేరుకోగలుగుతుంది".
అని, తన రాజకీయ, సామాజిక
ఆశయాన్ని స్పష్టం చేశారు.
అదే ఆయన పిలునామా.
ఆయన యువతరానికి అప్పగించిన బాధ్యత అదే!
పాతూరి నాగభూషణం, ఆయన చేపట్టిన సంస్థలు,

నిదానంగా నడిచే తరహావి.
కాని, కాలం ఆగదు. చురుకుగా సాగింది.
**1959** డిసెంబరులో,
రావుగారి తమ్ముడు మరణించారు,
ఆ విచారం ఆయనను క్రుంగదీసింది.
జనవరి **1960** లో రక్తపుపోటు, పక్షవాతం,
ఆయనను ఆస్పత్రి మంచం పట్టించాయి.
"నన్ను సాకేవారెవరు ?
ఉన్నకొద్దీ అందరికీ నేను బరువే.
నేనింక చేయగలిగింది ఏమీ లేదు".
అనుకుంటూ ఆ కర్మయోగి
**29-2-1960** నాడు ఈ లోకం వదిలాడు.
ఆయన అర్ధ శతాబ్దం పైగా
తెలుగు ప్రజలు,
నూటికి నూరు మందీ,
అన్నీ తెలిసిన వారు కావాలని
కలలు కన్నారు.
ఆ కార్యక్రమానికి పునాదులు వేశారు.

మిగిలిన పని, యువతరం, పూర్తి చెయ్యాలి.
అని, తరలి పోయారు.
ఆ పునాది ఇంకా అట్లాగే ఉంది.
ఇప్పుడు మనం ఏం చెయ్యాలి ?
ఏం చేద్దాము ?
అనే ప్రశ్నలనే
ఈ శత జయంతి
మనకు తిరిగి గుర్తు చేస్తోంది.
ఈ సవాలుకు
ఈనాటి యువతరం చెప్పే జవాబు,
చేపట్టే కార్యక్రమాలు,
ఏమిటి ? ఏమిటి ?

